# రత్న విపణి



శారదా శారదాంభోజ, వదనా వదనాంబుజే
సర్వదా సర్వదాఽస్మాకం, సన్నిధిః సన్నిధింక్రియాత్



రచయిత :

**ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి**

"పండితరాజు" గ్రామ వాసి

శ్రీ విక్రమనామ సంవత్సర మార్గశిర బహుళ పంచమి

ముంగండ, పి. గన్నవరం మండలం, తూ॥ గో॥ జిల్లా, ఆం॥ ప్ర॥

# రచయిత జీవిత విశేషాలు





జననం : తూర్పుగోదావరి జిల్లా, ముంగండ గ్రామంలో 27-3-1914న

తల్లి దండ్రులు : శ్రీమతి కామేశ్వరమ్మ, శ్రీరామమూర్తి శాస్త్రిగారు

విశిష్ట విజ్ఞానం : 12 సంవత్సరాలు శ్రీ నారాయణమూర్తి అవధానిగారి వద్ద కృష్ణయజుర్వేదాధ్యయనం, శాస్త్ర కావ్య అధ్యయనం తండ్రిగారు శ్రీరామమూర్తి శాస్త్రి, మహీధర వెంకట్రామ శాస్త్రిగార్ల వద్ద, వ్యాకరణ శాస్త్రం శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రిగారి వద్ద, తెలుగు సాహిత్యం, పరిశోధన ప్రొ॥ కోరాడ రామకృష్ణయ్యగారి వద్ద

విద్య : 1938 మద్రాసు యూనివర్సిటీలో విద్వాన్‌లో ఉత్తీర్ణత

ఉద్యోగం : 1950-69 తెలుగు పండిట్‌గా బోర్డు హైస్కూళ్ళలో

గ్రంథ రచన : 1966- "కాళిదాస హృదయము" - గ్రాంధిక భాషలో

తెలుగులో : 1971 - భక్త పోతన - మహా భాగవత రచన

1987 - హైందవ ధర్మామృతం

సంస్కృతంలో: 1973 - కాళిదాస కావ్య సౌరభమ్

1983 - పండిత రాజ జగన్నాథ మహాకవిః

రేడియో ప్రసంగాలు: విజయవాడ AIR "అమర భారతి" లో పెక్కు ప్రసంగాలు, విశాఖపట్నం AIR లో సూక్తి ముక్తావళులు.

అభిరుచులు : సంస్కృత భాషా వ్యాప్తికై "భారతీయ విద్యా నికేతన్" ఆధ్వర్యంలో సంస్కృత తరగతుల నిర్వహణ.

ముంగండ గ్రామంలో జగన్నాథ పండితరాజ విజ్ఞాన మందిర స్థాపనలో విశేష కృషి,

కాళిదాసు మరియు జగన్నాథ పండితరాజ రచనలపై విశిష్ట పరిశోధనలు

బిరుదులు : 1) 1981లో శ్రీ ఉప్పులూరి గణపతి శాస్త్రిగారిచే "వేద విద్యా విశారద"

2) 1966లో శ్రీ కాశీ కృష్ణాచార్యులవారిచే "కాళిదాస రహస్య సర్వస్వాభిజ్ఞ - ప్రామాణిక విమర్శకాగ్రేసర"

శ్రీ విజయదుర్గా పవర్ ప్రెస్, భట్నవిల్లి. ఫోన్ : 31726



## -: అర్చన :-

"శ్రీకృష్ణం యదుభూషణం నరసఖం శృంగారరత్నాకరం
లోకద్రోహినరేంద్రవంశదహనం లోకేశ్వరం దేవతా-
నీకబ్రాహ్మణగోగణార్తిహరణం నిర్వాణసంధాయకం
శ్రీకృష్ణం స్మభజామి భావకుసుమైః చిత్తస్యశాంత్యైసదా॥"

(ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రీయం పద్యమ్)

ప్రథమ ముద్రణ
డిశంబరు. 2000

వెల : అమూల్యము



ప్రాప్తిస్థానం :
**ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి**
భారతీయ విద్యానికేతన్
ముంగండ - పిన్ : 533 234

ముద్రణ :
శ్రీ విజయదుర్గా పవర్ ప్రెస్,
భట్నవిల్లి,
అమలాపురం మండలం.
ఫోన్ : 31726



## అంకితం

"జగన్నాథాయ కవయే
గ్రంథ ఏషస్సమర్పితః
యో రాజతే విష్ణుపదే
విశ్వభాషాఽత్మికే సదా ॥"

**ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి**
"పండితరాజ" గ్రామవాసి
**ముంగండ.**



గ్రంథకర్త - ధర్మపత్ని :
**శ్రీమతి వెంకటరామలక్ష్మి**

## -: పండితాభిప్రాయము :-

బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి గారు అభిమానముతో పంపించిన **"రత్నవిపణి"** అనే పుస్తకాన్ని కూలంకషంగా చూడడం జరిగింది. ఆ పుస్తకము లోని శ్లోకరత్నములు చిన్నారి బాలలకు సులభముగా అర్థమయే విధముగా తాత్పర్యములు వ్రాసినారు. ఇది బాలబాలికలకు అత్యంత ఉపయోగకరమైనది. వారిభావిలో నిజంగా ఈ శ్లోకాలు చదువుతూంటే ఒక రకమైన మానసికానందం కలిగినది. ఇది నా అనుభూతి. ప్రస్తుతకాలమాన పరిస్థితులలో అంటే సినిమా, T V. (ఎలక్ట్రానిక్ మీడియా) ల ద్వారా బాలలు నేర్చుకునేదేమిటి ? అదివారి భావిజీవితాలలో ఏవిధంగా ఉపయోగపడుతుందో తెలియనిస్థితిలోవుంది సమాజం. సర్వము వ్యాపారం. పవిత్రమయిన గురుశిష్య సంబంధం, క్రమశిక్షణ విశేషించి విద్యారంగంలో బాగా తగ్గుముఖంపట్టాయి. ఒకరకంగా ఇందుకు తల్లిదండ్రుల బాధ్యతా రాహిత్యంకూడా వున్నదని చెప్ప సాహసిస్తున్నందుకు క్షమించమని ప్రార్థన. మా చిన్నతనాన పూజ్యులు మాతాతగారైన శ్రీ శ్రీరామమూర్తిశాస్త్రిగారు చక్కటి నీతి విలువలు భావిజీవితానికి వుపయోగించే హితోపదేశశ్లోకాలు అవీ చెప్పేవారు. అందుకు ప్రోత్సాహకరముగా శ్లోకాలు తప్పులులేకుండా, తాత్పర్య సహితంగా వప్పచెబితే మాకు

పావలా అర్ధరూపాయి ఇచ్చేవారు. పూజ్యులు ఇచ్చిన ఆ ప్రోత్సాహంతోనే అమరకోశం, (3 కాండలు) ఆంధ్రనామ సంగ్రహం, హితోపదేశం, మూకపంచశతి మొదలయినవి కంఠోపాఠమయినవి. వయసు వచ్చిన తరువాత హితోపదేశ సూక్తులు జీవితంలో చాలావుపయోగకారి అయినాయి. ఈనాడు ఆసందర్భంలేదు. కారణం పాశ్చాత్య విద్యా వ్యామోహం ఆటపాటలబాల్యం, బండెడుబరువుపుస్తకాలతో యూనిఫారాలతో L.K.G. క్లాసులకు పరుగులతోనే సరిపోతూంది. ఇంటికి ఎవరయినా అతిథులు, పెద్దలు వచ్చినారారండి కూర్చోండి అనేకనీస మర్యాదలుకూడా చిరంజీవులలో లుప్తమవుతున్నాయి. మన భారత సంస్కృతీ, సంప్రదాయాలు చక్కటిరీతిలో వుండాలి అంటే,చిరంజీవులు చిన్ననాటినుండి విజ్ఞానవంతము,సంస్కారవంతముఅయిన విద్యాభ్యాసం చేయాలంటే వారి తల్లిదండ్రులు బాధ్యత తీసుకుని వారికి మంచివిషయాలు బోధచేయవలసిన అవసరం ఎంతైనావుంది. అదివారిబాధ్యతకూడా !

నిజంగా ఈ "రత్న విపణి" ని మీ చిరంజీవులకు కంఠస్థమయే విధంగా చేయండి. వారి భావి ఎంతసంస్కారవంతంగా, విజ్ఞానవంతంగా వుంటుందో మీరే చూడండి. విద్యయొక్క అవసరం, విద్యావిహీనతవల్లకలిగే కష్టనష్టాలు తెలిసికొనడం ఉత్తమమానవలక్షణం. దుష్టసాంగత్యంవల్ల కలిగేఅనర్థాలు, సజ్జనసహవాసం వల్ల కలిగే ఫలితాలు



ఒకటేమిటి నిజంగా ఇది విజ్ఞానరత్నవిపణే. ఈ రత్నవిపణిలో ప్రవేశించడానికి రుసుములెదు. ఏదీకొననవసరంకూడాలేదు. చిన్నారులు ఈ రత్నబజారులో నుండి వారికి కావలసిన రత్నాలు ఎత్తి ఉచితంగా తీసుకునివెళ్ళవచ్చును. అవి కంఠసీమను అలంకరించుకుని (కంఠస్థంచేసి) ఆ రత్నప్రభలతో (కాంతులు) మీరుభావిలో ఉత్తమ భారతపౌరులుగా తయారయి మనదేశమాత సేవలో చరితార్థులయే అవకాశాలు పొంది ధన్యులవుతారు. రవీంద్రకవీంద్రుడు అన్నట్లుగా "చదువు నేర్చినవాడు పదిమందికి నేర్పుతాడు" ఇదే మనపెద్దలుకూడా అంటూంటారు. "ఒక దీపం పదిదీపాలు వెలిగిస్తుందని." ప్రస్తుత మనప్రభుత్వప్రణాళికలు కూడా అవేగా ! అక్షర జ్యోతి, అక్షరసంక్రాంతి వగైరా.

విద్యార్జనకు వయసు, కులము, వర్ణము, లింగ బేధాలులేవు. సర్వులు విద్యావంతులు కావలసినదే. అపుడే సమాజం విజ్ఞానవంతమై, దేశం శాంతి, సౌమనస్య, సౌభాగ్యాలతో చక్కగావుంటుంది.

ఈ "రత్నవిపణిలో" కొన్నిరత్నాలు చూద్దాం (16వ శ్లోకం) ''యస్యకస్య ప్రసూతోపి" అనేరత్నం నేను పైన నుదహరించిన భావం. విద్యకు, ప్రతిభా వ్యుత్పత్తులకు పుట్టుకతో నిమిత్తం ఏముంది ? దళితుడైన B.R. అంబేత్కర్ మహాశయుడే ఈ శ్లోకానికి ఉదాహరణ.

మరొకరత్నం (22 వ శ్లోకం) "గుణాః గుణజ్ఞేషు" ఈ రత్నం నిజంగా వెలకట్టలేని రత్నమే (అన్‌మోల్ హీరా)

మన పెద్దలు అంటూంటారు. "సహవాసయా దోష గుణా భవంతి" అని. సజ్జనసహవాసం జీవితానికి వెలుగునిస్తుంది. దుష్టసాంగత్యం తను చెడడమేకాదు సమాజానికి కూడా ప్రమాదం తెచ్చిపెడ్తుంది.

మరొకటి చూద్దాం (26 వ శ్లోకం) "షట్ దోషాః పురుషేణేహ" అనే రత్నం. ఇది ఒక వ్యక్తి తనజీవితంలో పైస్థాయికి ఎదగాలంటే తనకేకాకుండా సమాజానికి దేశానికి కూడా వుపయోగపడే వ్యక్తికికావలసిన, నేర్వవలసినలక్షణాలు చెబుతూంది. ఏవి ఆచరించడం వల్ల వ్యక్తి ఉన్నతుడు ఉత్తముడు అవుతాడో, ఏది ఆచరించడంవల్ల పతితుడవుతాడో బోధించేఅనర్ఘరత్నమిది.

మరోరత్నాన్ని పరీక్షిద్దాం (42 వ శ్లోకం) "ఆదిత్య చంద్రౌ" అనే రత్నం సాధారణంగా మానవుడు తెలిసో తెలియకో తప్పులు చేస్తుంటాడు. కాని స్వార్థచింతనతో, అర్థకాంక్షతో రహస్యంగా మనంచేసే దానిని ఎవరుగమనించలేదు. ఏన్యాయస్థానము మనకు శిక్షవిధించలేనంతరహస్యంగా, పగడ్బందీగా చేసేము అనుకుంటాము. కాని వాటిని కూడా చూసేవారున్నారు, సాక్ష్యమిచ్చే వారున్నారు. అదే ఆఖరి తీర్పు.(Last Judgement) అపుడు ఆకోర్టులో సాక్షులు ఈ శ్లోకంలోనివారే. కనుక సాధ్యమయినంతవరకు "తప్పువైపుకుచేరని జీవితం గడపడానికి ప్రయత్నంచెయ్యి" అని ఈ రత్నప్రభోధం. ఇలా ఒకటేమిటి ఎన్నో అమూల్య



రత్నాలు, మానవుడు తనజీవితాన్ని తీర్చిదిద్దుకుని మాధవత్వాన్ని సాధించేందుకు ఉపకరించేవి.

ఇక "శ్రీ శంకరభగవత్పాద రచిత ప్రశ్నోత్తరరత్న మాలిక. ఈరత్నమాలను కంఠసీమను ధరించిన (కంఠస్థం) చిరంజీవులు పవిత్రభారతదేశ భావిపౌరులై విజ్ఞానయుతులై, శీల, వినయ, గురుభక్తియుతులై, మనభరతమాత కీర్తి-ప్రతిష్ఠలను ప్రపంచంలో మహోన్నత స్థాయికి చేరుస్తారనడంలో అతిశయోక్తి ఏమీలేదు.

చి॥ బాలబాలికలారా ః చిన్ననాటనుంచి క్రమశిక్షణాయుతము, గురుభక్తి, పెద్దలపట్ల వినయవిధేయతలు, శ్రమ, పట్టుదల, సాధనలు అలవరచుకుని మీభావిజీవితం ఈ రత్నమాలికా ధారణంతో వాటినుండి ప్రసరించిన దివ్యవిజ్ఞానకాంతులు మీకు సర్వ శ్రేయస్సులు, శుభాలను ప్రసాదించాలని ఆశిస్తూ.

విద్వజ్జనవిధేయుడు :

మీ

**చెల్లూరి సూర్యభాస్కరరావు**

ముంగండ,

15-12-2000,

శ్రీ విక్రమ మార్గశిర బహుళ పంచమి.

మకుటం : "బాలబాలికాః పఠత సంస్కృతమ్"

1. దేవవాఙ్మయమ్, దివ్యలక్షణమ్, వేదశాస్త్రకళ్యాణ మందిరమ్ ।
విశ్వశాంతిదం, విశ్వరక్షకమ్, బాలబాలికాః పఠత సంస్కృతం ॥

వివరణ : ఓ బాలబాలికల్లారా ! మీరు సంస్కృతమును చదవండి. ఎందుకనగా, ఈ సంస్కృతభాష దేవతలు మాట్లాడేభాష. కనుకనే ఇది దివ్యలక్షణములతో కూడిఉన్నది ఇంకా ఈ భాష, ప్రపంచశ్రేయస్కరమైన వేదశాస్త్రములకు పుట్టినిల్లుగా ఉన్నది. కనుకనే అందరికీ శాంతిసౌఖ్యముల నిచ్చి రక్షించేది.

ఓ బాలబాలికల్లారా ! ఇన్ని లాభములతో కూడి యున్న ఈ సంస్కృతభాషను మీరు మీ చిన్ననాటినుంచీ శ్రద్ధగా చదవండి.

2. సర్వశాస్త్ర విజ్ఞాన విలసితమ్, సర్వజీవినాంకాంక్షిత ప్రదమ్ ।
మానవేషు తన్మాధవత్వదమ్, బాలబాలికాః పఠత సంస్కృతం ॥

వివరణ : ఈ దివ్యభాషలో, ప్రపంచంలోని శాస్త్రములన్నింటిలో గల విజ్ఞానములన్నీ ఉన్నవి. కనుకనేప్రపంచ



ప్రజలయొక్క అన్నిరకముల కోర్కెలనూ ఇది తీర్చగలిగి ఉన్నది. ఇంతేకాకుండా, ఈ అమరభాష, మానవులను దేవతలుగా మార్చగలిగి ఉన్నది.

(కనుక ఓ బాలబాలికల్లారా ! ........ మొదటి శ్లోకంలోని మకుట భావమే మిగతా మకుటాలకూ సమానము)

3. భూమి వాసినః స్వర్గవాసినః, ఏకకేంద్రకే మేలయత్యహో !
సర్వ వాఙ్మయేష్వద్భుత ప్రదం, బాలబాలికాః పఠత సంస్కృతం ॥

వివరణ : సంస్కృత భాషామతల్లి మానవులనూ దేవతలనూ ఒక కేంద్రబిందువులోనికి ఆకర్షించి అది అచ్చట మానవత్వాన్ని దేవత్వాన్నిగా పరిణమింప జేయ గలిగి ఉన్నది. ఈ విషయాన్ని ఒక నిదర్శనంతో విశదంచేస్తాను. కాళిదాస కవీంద్రుని "శాకుంతల నాటకం" లో దేవేంద్రుడు తనకు సహాయంగా రమ్మని మాతలిద్వారా దుష్యంత మహారాజువద్దకు తన విమానమును పంపగా ఆమహారాజు స్వర్గానికివెళ్ళి, ఇంద్రునకు సహాయం చెయ్యడం, ఆ సహాయానికి సంతసించి ఇంద్రుడు దుష్యంతునకు సన్మానం చేయుడం జరుగుతుంది. అక్కడనుండి మహారాజుమాటపై మాతలి (ఇంద్రసారథి) మారీచాశ్రమానికి దుష్యంతుణ్ణి తీసికొనివెళ్ళడం, అక్కడ శకుంతలా పుత్ర దుష్యంతుల

సమాగమం, ఈ సన్నివేశాలను కాళిదాస కవీంద్రుడు ధ్వని ప్రధానంగా చిత్రించి, మానవలోకాన్ని మాధవలోకంగా పరిణమింప జేశాడు. ఈ పరిణామ వర్ణనం ఇతరవాఙ్మయాలకు అద్భుతమును ఆపాదించగలిగి ఉన్నది.

4. ఐక్యలక్షణం మానవేషు ఆధ్యాత్మదీపకమ్,
రాజసాపహమ్ ।
సర్వజీవినాం సర్వసౌఖ్యదం, బాలబాలికాః
పఠత సంస్కృతం ॥

వివరణ : ఈ దివ్యభాష, దివ్యబోధల ప్రభావంతో మానవుల మానసములలోని రాజసగుణమును పారద్రోలి నిర్మలములైన మనస్సులలో మనభాష ఆధ్యాత్మిక భావములను ప్రకాశింపజేయడం ద్వారా శాంతి సౌఖ్యములతో మానవ జీవితములను ధన్యములు చేయగలిగిఉంది. కనుక బాలబాలికాః .... .... ....

5. విశ్వపుష్టిదమ్, విశ్వతుష్టిదమ్, విశ్వమోహనం,
విశ్వరక్షకం
ధర్మరక్షకమ్, ధర్మపోషకమ్, బాలబాలికాః పఠత
సంస్కృతం ॥

శ్లోకార్థం సులభమైనది.

రచన, వివరణ -

**ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి**



# నా మొదటి మాట.

భావి భారత పౌరులు కాబోయే చిరంజీవులకు నా హార్దికాశీస్సులు.

## బాలబాలికలారా !

మీకోసమని ప్రత్యేకంగా ఒక **'రతనాల అంగడి'** నిర్మించినాను. ఇందలి రత్నాలయొక్క భావకాంతులు మీ లేతమనస్సులను క్రమంగా ప్రకాశవంతములుగా చేయగలిగి ఉన్నాయి. లోకంలోని భౌతికరత్నములు శరీరం లోపల ఉన్న "మనస్సు"ను ప్రకాశింపజేయలేవు. కనుక ఈ "రత్నవిపణి" లో ఉన్న రత్నాలకు గలశక్తి మామూలు రత్నాలకు లేదన్నమాట.

ఈ శ్లోకరత్నాలను మీకంఠసీమలలో ధరించిన యెడల (అనగా కంఠస్థము చేయుట) మీ మనస్సులు అచిరభావిలో జ్ఞానకాంతులతో రాణించగలవు. మీరుయువకులయ్యేటప్పటికి ఆరత్నకాంతులు, మానవసమాజంలో మీకు ప్రత్యేకమయిన గౌరవఖ్యాతులను కలిగిస్తాయి. డా॥ రాధాకృష్ణపండితులు, డా॥ రాజేంద్రప్రసాద్, మహాత్మాగాంధీ వంటి మహాత్ములు తమ దేశమాతకు కలిగించిన శాంతి, సౌభాగ్యములను తిరిగి మీరుకూడా మీ "భారత దేశ" మాతకు కలిగిస్తారు.

ఈ శ్లోకరత్నాలలోని మంచిభావాలు మీ నిర్మల భావాలలో వెంటనే హత్తుకొని మీ భావాలను మహోదార భావాలుగా మలచగలిగి ఉన్నాయి. దీనితో మీజీవనములు ధన్యములవుతాయి.

"జయతు భారతం జయతు ధార్మికం"

మరొకముఖ్యవిషయం ॥

భాగ్యములలో ఆరోగ్యమేమహాభాగ్యము, ఈ విశిష్ట విషయమునే చరకసంహితాసూక్తి ఇట్లు వక్కాణించినది.

శ్లో॥ అంభసః ప్రసృతీరష్టౌరవావనుదితేపిచేత్ ।
వాత పిత్త కఫాన్ జిత్వా జీవేత్ వర్షశతం సుఖీ ॥

తా॥ :- తనఆరోగ్యం కోరినవాడు సూర్యోదయము కాకుండగానే అనగా తెల్లవారుఝామునే 5 గంటలకు లేచి దంతధావనానంతరము తన పుడిశెలి (తన ఒకచేతిలో పట్టినన్ని) చన్నీళ్ళు అనగా అప్పుడు పంపునుంచి పట్టిననీరు వడపోసి 8 పుడిశెళ్ల నీరు త్రాగినచో, వాతపిత్త శ్లేష్మములు సరిపాళ్లలో వుండి మానవుడు సుఖంగా (ఏరోగములేకుండ) నూరేళ్లు బ్రతుకును. ఇది ప్రతీ రోజూ అందరూ ఆచరించ వలసిన ఆరోగ్యసూత్రము.



బాలబాలికల తల్లిదండ్రులకు ఒకముఖ్యవిషయాన్ని విన్నవిస్తున్నాను. బాలబాలికల తల్లిదండ్రులారా : 8-12 ఏళ్లవయసులోవున్న మీ చిన్నారుల కోసమని ఈ "రత్న విపణిని" ఏర్పాటు చేసినాను. కనుక మీ చిరంజీవులకు ఇందలి శ్లోకరత్నములను + తాత్పర్యములను మీరు తెలియచెప్పి తప్పులులేకుండా వల్లింపజేయండి. ఆశ్లోక భావాన్ని మీరు చిన్నమాటలలో బోధించండి. బోధించాక చిన్నచిన్న ప్రశ్నలువేసి ఆ శ్లోక భావాన్ని రాబట్టండి. ఎందుకంటే తమ బిడ్డలకు తల్లిదండ్రులే మొట్టమొదటి ఉత్తమ గురువులు. మీరు నేను చెప్పినట్లుచేస్తే ఈ నా ప్రయత్నం సఫలము కావడమేకాక, మీచిన్నారులుకూడా అచిరభావిలో (భావిభారతపౌరులై) మన పవిత్రభారతదేశ ప్రతిష్ఠను తిరిగి సుప్రతిష్ఠితం చేయగలుగుతారు. ఇంత కంటే మనకు వేరే కావలసినదేమున్నది ?

ఇట్లు
మీ శ్రేయోభిలాషి,
ఖం॥ సూర్యనారాయణశాస్త్రి.

ఓ మ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# రత్న విపణి. ★

శ్లో॥ వాగీశాద్యాః సుమనసః సర్వార్థానా ముపక్రమే।
యం నత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి
గజాననం॥

తా॥ బ్రహ్మ మొదలైన దేవతలు ఏదేవునికి మొదట నమస్కరించి, తమతమ పనులయందు కార్యసిద్ధికలవారైనారో అట్టి మహిమకల విఘ్నేశ్వరునికి నేను మొట్టమొదట నమస్కరించెదను.

1శ్లో॥ యథా చిత్తం తథావాచః యథా వాచః తథా క్రియాః।
చిత్తేవాచిక్రియాయాం చ మహతాం ఏకరూపతా॥

తా॥ "మహాత్ములు" అనిపించుకున్నవారు, వారిమనస్సులో ఉన్నభావాన్నే పైకి చెపుతారు. వారు చెప్పినట్లే చేస్తారు. అనగా 'మనస్సు, మాట, పని' ఈమూడింటి

---

★ రత్నములు లభించే అంగడి కనుక మంచిభావాలతో చదువుమొదలైన పనులను "త్రికరణశుద్ధి"తోనే చెయ్యవలసిన బాధ్యత మనమీద ఉన్నదన్నమాట.

యందును సమానమైన భావంతో మానవుడు ప్రవర్తించుట అనేపనిని "త్రికరణశుద్ధి" అంటారు. ఇట్టివారినే మానవులు "మహాత్ములు" అని సాదరంగా పిలుస్తారు. భావిభారత పౌరులుకాబోతూన్న బాలబాలికలారా ! మనం మొట్టమొదట విఘ్నేశ్వరుని భక్తితో నమస్కరించినాముకదా ! కనుక ఆవినాయకుడు మనకు సర్వకార్యసిద్ధినీ కలిగిస్తాడు. పిమ్మట మహాత్ములను శ్రద్ధగా స్మరించినాము. ఈ స్మరణము మహాత్ముల అనుగ్రహమును మనకు అమరజేస్తుంది. ఆమహాత్ములు "లోకశ్రేయస్సే" ధ్యేయంగా (ముఖ్యఅభిప్రాయంగా) కలవారు. ఈక్రమంవలన, మనకు సజ్జనుల అనుగ్రహ ప్రభావమువలన అన్నిరకాలైన అభ్యుదయములు అబ్బుతవి.

2 శ్లో॥ నాస్తి విద్యాసమం చక్షుః, నాస్తిసత్యసమం తపః ।
నాస్తిరాగసమం దుఃఖం, నాస్తిత్యాగసమం సుఖం॥

తా॥ విద్యతో సమానమైన నేత్రములేదు. ఇట్లే సత్యవాక్కుతో సమానమైన తపస్సుకాని, భౌతికప్రేమతో సమానమైన దుఃఖముకాని, కర్మఫలత్యాగముతో సమానమైన సుఖముకాని లేదు.

3 శ్లో॥ సుఖార్థీచేత్ త్యజే ద్విద్యాం, విద్యార్థీచేత్ త్యజేత్ సుఖం ।
సుఖార్థినః కుతో విద్యా. కుతో విద్యార్థిన స్సుఖం॥



తా॥ భౌతికసుఖాన్ని మాత్రమేకోరెడు విద్యార్థికి విద్యాభ్యాసమును విడువవలసివచ్చును. ఇక విద్యనే కోరెడు విద్యార్థి సుఖమును అపేక్షింపరాదు. సుఖాన్ని కోరేవానికి విద్య అబ్బదు. విద్యనే కోరేవానికి సుఖాఽపేక్ష ఉండరాదు.

4 శ్లో॥ విహితస్యాఽననుష్ఠానాత్ నిందితస్యచ సేవనాత్ ।
అనిగ్రహా చ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥

తా॥ మానవుడు దేనికీపనికిరానివాడుగా, అనగా సమాజములో గౌరవంలేనివాడుగా తయారయేవిధానాలు మూడున్నవి. (1)మానవశ్రేయస్సునకై చెప్పబడిన నైతిక ప్రవర్తనమును విడిచివేయుట, (2) చెడుప్రవర్తనకు సంబంధించిన దోషములనే సేవించుట, (3) తనఇంద్రియాలను తనఅదుపులో పెట్టుకొనక, వానిని విచ్చలవిడిగా విడిచివేయుట, ఈమూడింటికి అధీనమయిన మానవుడు సులభముగా పతితుడగును.

5 శ్లో॥ చింతనీయాహి విపదాం ఆదావేవ ప్రతిక్రియా ।
నకూపఖననం యుక్తం ప్రదీప్తే వహ్నినా గృహే॥

తా॥ బుద్ధిమంతుడు "ఒకవిధమైన ఆపదరాబోవుచున్నది" అని తెలియుగానే దానికి తగిన ఉపాయమును ఆలోచించి ఆఆపదనుండి రక్షింపబడవలెను. అలాచేయక సోమరిపోతుగా ఉన్నవాడు, ఇల్లు అంటుకొనిన పిమ్మట

దానిని ఆర్పుటకై నుయ్యి త్రవ్వుటకు ప్రారంభించిన వాడువలె అపహాస్యపాత్రుడగును.

6 శ్లో॥ యథా పశ్యసి రంధ్రాణి పురతో గచ్ఛతాం స్వయం।
దోషాస్తైరేవ దృశ్యంతే తవపృష్ఠానుఽగామిభిః॥

తా॥ ఒకమానవుడు తనకు ముందుగా నడుస్తున్న వాని దోషాలను యెంచి తనపక్కవారితో చెప్పినచో తను ముందుగా నడుస్తున్నపుడు తనదోషాలనుకూడా తనవెనుక ఉన్నవాడు తనపక్కవానితో చెప్పే అవకాశం ఏర్పడుతుంది. కనుక బాలబాలికలారా : మీరు మొట్టమొదట మీతోటివారి మీద చాడీలు ఎవరితోను చెప్పకున్నచో మీతోటివారుకూడ మీమీద చాడీలుచెప్పే అవకాశం ఏర్పడదుకదా :.

7 శ్లో॥ అజరాఽమరవత్ప్రాజ్ఞః విద్యామర్థంచ సాధయేత్ ।
గృహీతఇవకేశేషు మృత్యునా ధర్మమాచరేత్॥

తా॥ తెలివితలవాడు ముసలితనము లేనివానివలెను, చావులేనివానివలెను భావించి క్రమంగా విద్యాధనములను సాధించవలెను. ఇట్లే తనశిరస్సు మృత్యుదేవతచేతిలో ఉన్నట్లుతలచి వీలున్నంత తొందరలో తనధర్మకార్యములను అనగా తనకు శ్రేయస్సును కలిగించే మంచిపనులను పూర్తి చేసుకొనవలెను.

8 శ్లో॥ శ్వఃకార్య మద్యకుర్వీత పూర్వాహ్ణేచాపరాహ్ణికం :
నహిప్రతీక్షతే మృత్యుః కృతమస్యనవాకృతం॥



తా॥ రేపటిపనిని ఈరోజునను అట్లే మధ్యాహ్నం పనిని పొద్దున్నను ముందుచూపుకలవాడు చేసుకొనవలెను. ఎందుకనగా మృత్యుదేవత కాలం సమీపించిన ఈమానవుడు తనముఖ్యమైన పనులను చేసుకొన్నాడా ? లేదా ? అని ఆలోచించదు కనుక.

9 శ్లో॥ వికృతిం నైవ గచ్ఛంతి, సంగదోషేణ సాధవః ।
ఆవేష్టితం మహాసర్పైః, చందనం న విషాయతే॥

తా॥ సత్పురుషులు (సజ్జనులు) చెడ్డవస్తువులతో తమకు సంబంధంఉన్నను అవస్తువుల చెడ్డతనం వంచి వారిలో ఏవిధమైనమార్పునులేక వికారమును కలిగించజాలదు. ఎట్లనగా మంచిగంధపు చెట్టును విషముకల సర్పములు చుట్టుకొని ఉండును. ఐనను వాటివిషము ఆ గంధపుచెట్లకు ఎట్టిమార్పును కలిగించలేదు.

10 శ్లో॥ విభూషణం శీలసమంచ నాఽన్యత్
సంతోషతుల్యధనమస్తి నాఽన్యత్.

తా॥ మానవులకు ఉత్తమశీలంతో సమానమైన మరో ఆభరణంకాని సంతోషముతో సమానమయిన మరొకధనముకాని జగత్తులో లేదు.

11 శ్లో॥ గుణవద్వస్తుసంసర్గాత్, యాతిస్వల్పోపి గౌరవం ।
పుష్పమాలాఽనుషంగేణ, సూత్రంశిరసి ధార్యతే॥

తా॥ మంచిగుణములుకల వస్తువుతో సంబంధంకల తక్కువ వస్తువుకూడ మానవులచే గౌరవింపబడును. ఎట్లనగా, మంచిగుణములుగల పుష్పములతో కలిపి గ్రుచ్చబడిన తక్కువగుణముగల దారముకూడ మహాత్ముల శిరస్సులను అధిరోహించడంరూపంలో ఆదారముకూడ మహాత్ములచే గౌరవింపబడినట్లేకదా : దీనినిబట్టి సజ్జనులతో సంబంధముగల ప్రతివ్యక్తికి సర్వాభ్యుదయములు సంప్రాప్తము లౌతాయని ఇందలి భావము.

12 శ్లో॥ గౌరవం ప్రాప్యతే దానాత్, నతు విత్తస్య సంచయాత్ ।
స్థితిరుచ్చైః పయోదానాం, పయోధీనామధఃస్థితిః॥

తనవద్దనున్న ధనాదిద్రవ్యమును స్వేచ్ఛగాను సంతోషముతోను ఇతరులకు దానముచేసే దాతకు లోకంలో ఉన్నతమైనస్థితి కలుగును. ఇక తనవద్దనున్న ద్రవ్యమును దానముచేయక తనవద్దనే కూడబెట్టుకొనేవానికి నీచ (తక్కువ) స్థితిమాత్రమే కలుగును. ఎట్లనగా మేఘుడు తనవద్దఉన్న జలరూపమైన సంపదను ప్రపంచప్రజలందరకును పూర్తిగా దానముచేయుటచేతనే అతడికిమహోన్నతమైన "మేఘమండలస్థితి" అబ్బినది. ఇక సముద్రుడు తన జలరూపసంపదను ఎవ్వరికీ దానముచేయక తనవద్దనే కూడబెట్టుకొనుటచేతనే అతడికి (నీచ) క్రిందస్థితి కలిగినది. ఉన్నతస్థితి కావాలనుకొన్నవాడు తప్పనిసరిగా తనద్రవ్య



మును పరులకు సంతోషముతో దానముచేయవలెనని ఈ సుందరసూక్తి ఉపదేశిస్తుంది.

13 శ్లో॥ విద్యా దదాతివినయం, వినయాద్యాతి పాత్రతాం।
పాత్రత్వాత్ ధనమాప్నోతి, ధనాద్ధర్మం తతస్సుఖం॥

తా॥ శ్రద్ధాభక్తులతో చదువుకొన్న విద్యార్థికి విద్య వినయమును ఇచ్చును. ఆవినయమువలన అతడు మంచి యోగ్యత అనగా అర్హతగలవాడు అగును. ఇట్టి పాత్రత వలన ధనమును ఆధనమువలన ధర్మబుద్ధియును అవిద్యార్థికి కలుగును. దీనికి సరియైన తెలుగుపద్య మిది.—

విద్యయొసగును వినయంబు వినయమునను
బడయు పాత్రత పాత్రతవలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన
ఐహికాఽముష్మికసుఖంబు లందు నరుడు.

14 శ్లో॥ యౌవనంధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా।
ఏకైకమప్యనర్థాయ, కిముయత్ర చతుష్టయం॥

తా॥ మానవుడు కన్నుమిన్నుగానని నడియవ్వనములో నుండుట, అప్పుడు ధనసంపదకల్గుట, అట్టి సంపత్సమయంలో ఉన్నతోద్యోగం లభించుట, ఈమూడింటికి తోడుగా అట్టివానికి అవివేకం అబ్బుట అనే ఈనాలుగు సన్నివేశాలలో మానవునకు ఏఒక్కటి ఉన్ననూ అది అతనిని

అనర్థములలో పడవేయును. పైనిచెప్పిన నాల్గును కలిసి ఉన్నవాడు మూర్ఖాఽతిమూర్ఖుడై పతితుడై! పోవును.

15 శ్లో॥ విద్యావివాదాయ, ధనం మదాయ, శక్తిః
పరేషాం పరపీడనాయ ఖలస్య।
సాధోః విపరీతమేతత్, దానాయ, ధర్మాయచ,
రక్షణాయ॥

తా॥ దుష్టునిపొందిన విద్య ఇతరులతో విపరీత వాదం చేయడానికిని, ఇట్లే వానిని పొందినధనం వానికి మత్తెక్కించడానికిని, వానిశక్తి పరులను పీడించడానికిని మాత్రమే ఉపయోగించును. ఇక సజ్జనుణ్ణిపొందిన విద్య పరులకు విద్యాదానము చేయుటకును, అతడిధనము ధర్మ కార్యములకై పరులకు దానం చేయుటకును, సజ్జనుని శక్తి ఇతరులను అపాయములోనుండి రక్షించుటకును మాత్రమే ఉపయోగించును.

16 శ్లో॥ యస్య కస్య ప్రసూతోపి, గుణవాన్ పూజ్యతే నరః।
ధనుర్వంశవిశుద్ధోపి, నిర్గుణః కిం కరిష్యతి॥

తా॥ ఈశ్లోకంలోని గుణము అనేశబ్దానికి 2 అర్థాలున్నవి. (1) మంచిగుణము, (2) నారితాడు అని. ఇక "వంశము" అనే శబ్దానికికూడా 2 అర్థాలున్నవి. మంచి కులము, మంచి వెదురుబొంగు అని 2 అర్థాలున్నవి. ఇప్పుడు తాత్పర్యం వినండి–



మానవుడు ఏకులము అనగా ఏవంశములో పుట్టిన వాడైననూ అతడు ఉదారగుణములు కలవాడైనచో మానవులందరిచేతను గౌరవింపబడును. ఎట్లనగా ధనస్సు అనగా విల్లు మంచి వెదురుబొంగుజాతికి చెందినదైనను, అనగా మంచివెదురుబద్దతో నిర్మించబడినదైనను ఆ ధనస్సునకు 'గుణము' అనగా నారిత్రాడులేనిచో అట్టి ధనస్సు ఉపయోగం లేనిదే అవుతుందికదా!

సారాంశమేమనగా ఎంతటి ఉన్నతకులంలో పుట్టిన మానవుడైనను, అతడు ఉత్తమగుణములు కలవాడై నప్పుడే అతడివలన సమాజమునకు ఎన్నో ఉత్తమప్రయోజనములు సిద్ధించగలవని ఈసూక్తి సూచించుచున్నది.

బాలబాలికలారా! కొన్నివందల (వేల) మంది మనుజులున్నదే మానవసమాజము అనబడును. వీరిలో 100 మందిలో 75 గురు మంచిగుణములు కలవారైన నాడే ఉత్తమోత్తమమైన "మానవసమాజము" ఏర్పడును. అట్టి మానవసమాజంవలననే దేశశ్రేయస్సు, దేశకళ్యాణము, దేశాఽభ్యుదయము అనేవి సిద్ధించును.

భావిభారతపౌరులారా! ఈచెప్పిన అభ్యుదయము లన్నీ మీమీదనే ఆధారపడిఉన్నవి అనేమాట మరచిపోరు కదూ!

17 శ్లో॥ యథా హ్యేకేన చక్రేణ, న రథస్య గతి ర్భవేత్ ।
ఏవం పురుషకారేణ వినా దైవం న సిద్ధ్యతి॥

తా॥ నాలుగుచక్రములతో నడకసాగించగల రథము ఒకచక్రముతో అదినడక సాగించలేనట్లు "పురుషకారము, దైవము" అనే 2 శక్తులు కలసి ఉన్నప్పుడు మాత్రమే మానవుని పనులు సఫలములు అయినట్లు ఒక్కదైవశక్తితో మాత్రమే మానవుని పనులు సఫలములు కావు. కనుక తన కార్యములు సఫలములు కావాలనుకున్నవాడు మీది 2 శక్తులను సంపాదింపక తప్పదు.

18 శ్లో॥ కాకతాళీయవత్ ప్రాప్తం, దృష్ట్వాఽపి నిధిమగ్రతః ।
న స్వయం దైవ మాదత్తే, పురుషార్థ మపేక్షతే॥

తా॥ ఒకనికి నిధి అనగా గని, దానియంతట అదే కనిపించిందనుకొనండి. ఆధనంని చూసినవానిచేతికి వచ్చి అది వానికి ఉపయోగపడవలెను అనుకొన్నపుడు తనపురుష కారము నంతనూ మనస్ఫూర్తిగా ప్రయత్నించినమీదటనే ఆనిధిలోని ధనం తనకుటుంబమువారందరికిని ఉపయోగించును. అలా తాను పురుషకారము చూపక, దానిని ఆ దైవమే తీసికొనివచ్చి తనకు యివ్వవలెనంటే, అట్టిపని యెప్పుడును జరుగదు. అనగా పురుషకారం చూపనివానికి ఏ ఒకపని సఫలము కాదన్నమాట. అనగా దైవశక్తికంటే పురుషప్రయత్నమే కార్యసిద్ధిని కలిగించే ఉత్తమసాధన మన్నమాట.



19 శ్లో॥ ఉద్యమేన హి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః ।
న హి సుప్తస్య సింహస్య, ప్రవిశంతి ముఖే
మృగాః॥

తా॥ ఎంతటి గొప్పమానవుడైనను తన పూర్తిపురుషాకారమును ప్రదర్శించిన పిమ్మటనే స్వీయకార్యములు సిద్ధించును. ఎట్లనగా మృగములన్నిటికి రాజుగా ప్రసిద్ధి పొందిన సింహము తనగుహలో నిద్రించియుండగా ఆ మృగరాజు గుహలోనికి మృగములు తమను ఆరగించమని స్వయంగా రావుకదా! ఆమృగరాజే స్వయంగా వేటాడి ఏనుగు కుంభస్థలములోని వపను తన వాడిగోళ్ళతో పైకిలాగి భుజింపవలెను. అప్పుడే దానికడుపు నిండును. చక్రవర్తి కొడుకైనను తన పూర్తిపురుషకారమును ప్రదర్శించిన పిమ్మటనే అతడి కార్యములు సిద్ధించును.

20 శ్లో॥ కాచః కాంచనసంసర్గాత్, ధత్తే మారకతీం ద్యుతిం ।
తథా సత్సన్నిధానేన, మూర్ఖో యాతి ప్రవీణతాం॥

తా॥ గాజురాయికి బంగారంతో కలయిక ఏర్పడుట చేత ఆగాజురాయి మరకత మాణిక్యంవలె ప్రకాశించును. ఇదేవిధంగా సత్పురుషసాంగత్యప్రభావంచేత మూర్ఖుడు కూడా ప్రావీణ్యమును (పాండిత్యమును) పొందగలడు.

21 శ్లో॥ కీటోఽపి సుమనస్సంగాత్, ఆరోహతి సతాం శిరః ।
అశ్మాపి యాతి దైవత్వం, మహద్భిః సుప్రతిష్ఠితః॥

తా॥ ఒకచిన్న పురుగు పుష్పముతోకలిసి, ఉండుట చేతనే ఆపుష్పంతోబాటు ఆపురుగుకూడ సత్పురుషులయొక్క శిరస్సును అధిరోహించును. అనగా పూజచేసినపిమ్మట ఆమహాత్ములు ఆపూజాపుష్పమును తమశిరస్సుపై ధరించగా పుష్పాన్ని ఆశ్రయించిన ఆపురుగుకూడ వారిశిరస్సును సులభంగా ఆశ్రయించును. ఇట్లే వీధిలో ఒక మూలపడిఉన్న రాతిని దేవుని ఆకారంలో చెక్కి గుడిలో మహాత్ములు ఆవిగ్రహమును సమంత్రకముగా ప్రతిష్ఠ చేసినది మొదలుకొని అది దేవతోపచారములతో పూజింపబడును.

ఈశ్లోకములోని విశేష మిది_

ఒకచిన్న పురుగు దేవుని ఆరాధనకు ఉపయోగపడే పుష్పమును ఆశ్రయించుటచేతనే అది సత్పురుషుల శిరస్సును అధిరోహించడంద్వారా ఆర్యులచే అది గౌరవింపబడినది. కనుక ఎంతటి తక్కువవస్తువనకైనను సత్పురుష సాంగత్యం సర్వాభ్యుదయ సంధాయకమగునని తెలుస్తూంది. ఇక 2వ నిదర్శనంచేతకూడా అనగా సత్పురుషుల పవిత్రహస్తస్పర్శచేత గుళ్లో ప్రతిష్ఠింపబడిన కారణము చేతనే దేవతోపచారాలు లభించినవి. మొత్తంమీద సజ్జనుల తోడి సంబంధం (కర్త) ఎంతటి తక్కువవస్తువులకైనను అభ్యుదయములను అమరజేస్తుందని స్పష్టమయింది. కనుక బాలబాలికలకు సత్పురుషులతోడి సంబంధం సుల



భంగా అభ్యుదయప్రాప్తికి అద్యకారణ మౌతుందని తేలిన సారాంశము.

22 శ్లో॥ గుణాః గుణజ్ఞేషు గుణా భవంతి, తే నిర్గుణం
ప్రాప్య భవంతి దోషాః।
ఆస్వాద్య తోయాః ప్రభవంతి నద్యః, సముద్ర
మాసాద్య భవంత్యపేయాః॥

తా॥ మంచిగుణములు, గుణములలోని ఆమంచిని తెలిసినవారి విషయంలోనే అవి మంచిగుణములుగానే రాణించును. ఇక ఆగుణములు దుష్టులను చేరినపుడు మాత్రం అవి దోషములుగా మారిపోవును. దీనికి నిదర్శనం చూడండి_ అమృతతుల్యములైన నదీజలములు ఆనదులలో ఉన్నంతవరకే ఆజలములు అందరకు ఆస్వాదయోగ్యము లగును. ఎప్పుడైతే ఆనదీజలములు సముద్రముతో సంగమించునో ఆక్షణమునుండి ఆమధురజలములు ఉప్పనగా మారి ఏఒక్కనికీ పానయోగ్యములుగాకుండును. బాలబాలికలారా! ఈనిదర్శనములు మీలేత మనస్సులలో నాటుకుంటే మీమంచితనం ఎప్పటికీ మంచిగానే నిలిచియుండి అది మిమ్ములను అందరికీ కలకాలం గౌరవనీయులుగా తీర్చిదిద్దుతుంది.

23 శ్లో॥ కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం।
వ్యసనేన చ మూర్ఖాణాం, నిద్రయా కలహేన వా॥

తా॥ బుద్ధిమంతులకు కాలం కావ్యశాస్త్రములకు చెందిన విజ్ఞానకరవినోదగోష్ఠితో గడచిపోవును. ఇతమూర్ఖుల కాలం దుష్టవ్యసనములతోనో, నిద్రతోనో లేక కలహంవంటి దుర్గుణములతోనో గడచిపోవును. చిరంజీవులారా ! దుష్టులతో 2 రోజులు స్నేహంచేసినా వారిదుర్గుణములు మంచి వారిని అవహించి, ఆమంచివారిని భ్రష్టులుగా మార్చేస్తాయి. లోకంలో నదీజలములు సహజంగానే అమృత తుల్యములై అందరకు ఆస్వాద్యములై దాహశాంతిని, అనారోగ్యశాంతినికూడ కలిగించగలిగిఉన్నాయి. ఇట్టి నదీ జలములు సముద్రములో సంగమించగానే సముద్రజలముల లక్షణమైన "ఉప్పన"గుణం ఆనదీజలాలకు అవహించి ఆమధురజలాలు "అపేయములు" అనగా త్రాగడానికి శక్యముకానివి ఔతాయి. ఈనిదర్శనంవలన చెడ్డ సహవాసం ఎవ్వరికీ ఏపరిస్థితిలోనూ పనికిరానిదే ఔతుందని తేలిన సారాంశం. కనుకనే "దుష్టులకు దూరంగా ఉండవలెను" అని పెద్దలమాట.

24 శ్లో॥ మాతృవత్ పరదారేషు, పరద్రవ్యేషు లోష్టవత్ ।
ఆత్మవత్ సర్వభూతేషు, యః పశ్యతి స పండితః॥

తా॥ పండితుడు యెట్లు వుండవలెననగా పరస్త్రీలను తనతల్లులవలె చూడవలెను. అట్లే ఇతరుల ద్రవ్యములను (వస్తువులను) మట్టిబెడ్డలవలెనూ, సర్వభూతములనూ తనతో సమానముగా చూడవలెను.



25 శ్లో॥ విపది ధైర్యం అథాఽభ్యుదయే క్షమా, సదసి వాక్పటుతా యుధి విక్రమః ।
యశసి చాభిరతిః వ్యసనం శ్రుతౌ,
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనాం॥

తా॥ ఈచెప్పబోయే గుణములు మహాత్ములకు స్వభావసిద్ధములై యుండును. ఆపదవచ్చినపుడు ధైర్యం వహించుట, శ్రేయస్సుకలిగినపుడు సహనం వహించుట, పండితసభలలో వాక్చాతుర్యం చూపుట, యుద్ధంలో పరాక్రమం చూపుట, కీర్తిసంపాదన విషయంలో ఆసక్తికలిగి యుండుట ఈ ఉత్తమగుణములు మహాత్ములకు సహజసిద్ధములైనవి.

26 శ్లో॥ షట్ దోషాః పురుషేణేహ హాతవ్యాః భూతిమిచ్ఛతా ।
నిద్రా తంద్రా భయం క్రోధః ఆలస్యం
దీర్ఘసూత్రతా॥

తా॥ తనకు ఐశ్వర్యం కావాలనుకున్నవాడు చెప్పబోయే ఆరుదోషాలను పూర్తిగా విడచిపెట్టవలెను. (1) తరచుగా నిద్రించుట, (2) ప్రతిపనిలో తొందరపడుట, (3) తొందరలో భీతిచెందుట, (4) అనాలోచితంగా క్రోధమునకు వశమగుట, (5) ప్రతిపనిలో ఆలస్యంచూపుట, (6) సోమరిపోతుతనం ఈఆరుగుణాలు మానవుని శ్రేయస్సునకు శత్రువులవంటివి. కనుక తనకు శ్రేయస్సును కోరు

కునేవాడు ఈచెప్పిన ఆరుదోషములను తప్పక విడచిపెట్టవలెను.

27 శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశః గృహాత్ ప్రతినివర్తతే ।
స తస్మై దుష్కృతం దత్వా పుణ్యమాదాయ
గచ్ఛతి॥

తా॥ ఒకఅతిథి ధనప్రాప్తి మొదలయిన ఆశతో ఒకనిఇంటికివెళ్ళి అటనిరాశుడై, ఆఇంటినుండి వృధాగా వెళ్ళిపోవుచూ, ఆఇంటియజమానునికి తనపాపమునుఇచ్చి, ఆ గృహస్వామియొక్క పుణ్యమును ఆఅతిథి తీసికొని పోవును.

28 శ్లో॥ అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితాని చ ।
వంచనం చాపమానం చ మతిమాన్ న ప్రకాశయేత్॥

తా॥ చెప్పబోయే అయిదువిషయాలకూ ఏఒకగృహయజమానుడును ; పైవారికి తెలుపరాదు. 1) ఆర్థికమైన నష్టమును, 2) తనమనస్సులోని పరితాపమును, 3) తన గృహచ్ఛిద్రాలనూ, 4) తనకు పరులవల్ల కల్గిన మోసములనూ, అవమానములనూ ఈఅయిదింటిని బుద్ధిమంతుడయిన గృహస్వామి పరులెవ్వరికినీ తెలుపరాదు. ఒకవేళ తెలిపినచో పరులు అట్టిగృహస్వామిని లోకువుగాచూచి అతడిని మూర్ఖునిగా భావించెదరు.



29 శ్లో॥ సంసారవిషవృక్షస్య ద్వే ఏవ అమృతే ఫలే ।
కావ్యాఽఽమృతరసాస్వాదః సంలాపః సజ్జనైస్సహ ॥

తా॥ సంసారము అనే విషవృక్షం రెండే రెండు అమృతఫలములను కాయును 1) మహాకవులయొక్క కావ్యములలో మహోపదేశరూపమైన అమృతరసమునుగ్రోలుట 2) మానవుల శ్రేయస్సునకై జీవనయాత్ర సాగిస్తూన్న సత్పురుషులతో తరచుగా సంలాపము సాగించుట ఈ రెండుఅమృతఫలములను మాత్రమే ఆసంసారమనే విషవృక్షం కాయును. మిగిలినవన్నియూ విషఫలములే. బాలబాలికలారా ! ఈశ్లోకంలోని సారాంశం ఏమనగా భౌతిక సంసారములో పుట్టి పెరుగుతూన్న మనజీవనయాత్రలో పైనచెప్పిన రెండు విషయములుమాత్రమే మనకు ఉపకరించునవి. మీకు అవకాశం (ఇంటరవెల్) కలిగినప్పుడల్లా మహాకవుల ఉత్తమకావ్యాలలోవున్న మహోపదేశాలను. మీ తల్లిదండ్రులు లేక విజ్ఞానవంతులైన పెద్దలవలన తెలుసుకొనుచుండుట. ఇట్లే సత్పురుషులతోను, ఉత్తమశీలగుణములుకల యువకులతోను స్నేహంచేస్తూ మీరు తరచుగా వారితో ఇష్టాగోష్ఠిచేస్తూండవలెను. ఇలాచేసినచో మీభావి అంతా అభ్యుదయములతోకూడి మీరు మీతోటివారిలో ఆదరగౌరవాలతో కీర్తింపబడుదురు. ఈవిషయం వేదంలో ఇలా చెప్పబడింది. "సమానానా ముత్తమశ్లోకో అస్తు" దీనిఅర్థమిది. తనతోటివారిలో మానవుడు ఉత్తమపురుషులచేకీర్తింపబడేవాడుగా (తనచిన్నతనంనుంచీ) తయారు కావలెను.

30 శ్లో॥ అతిదానాత్ బలిర్బద్ధః అతిమానాత్ సుయోధనః ।
అతిరూపాత్ హృతా సీతా అతి సర్వత్ర వర్జయేత్॥

తా॥ బలిచక్రవర్తి మరుగుజ్జుగా తనవద్దకు వచ్చిన బ్రహ్మచారికి ఆచక్రవర్తి ఆమరుగుజ్జుకు అతిగా దానంచేసి మరుగుజ్జుచే పాతాళమునకు అణచివేయబడెను. ఇకదుర్యోధనుడు మితిమీరిన దురభిమానం కలవాడై తుదకు శత్రువర్గంచే చంపబడ్డాడు. ఇక సీతాదేవి ఏఇతర స్త్రీలకు లేనంత రూపసౌందర్యం కలదికనుకనే రావణచక్రవర్తిచే అపహరింపబడెను. కనుక బాలబాలికలారా ! మంచిపనిలోకాని, చెడ్డపనిలోకాని అతిగా ప్రవర్తించిన ప్రతిఒకడూ చెడిపోవుననే విషయమును మీరుఎప్పుడునూ విస్మరించకండి.

31 శ్లో॥ బాలాదపి గృహీతవ్యం యుక్తముక్తం మనీషిభిః।
రవే రవిషయే కిం న ప్రదీపస్య ప్రకాశనం ॥

తా॥ యుక్తియుక్తముగా ఉన్నమాట బాలుడు చెప్పిననూ ఆమాట బుద్ధిమంతులకు గ్రాహ్యమయినదే. అనగా గ్రహింపతగినదేఅగును. ఎందుకనగా జగచ్చక్షువైన సూర్యభగవానుడు ప్రకాశింపచేయలేని చీకటిప్రదేశమును చిన్నదీపం ప్రకాశింపజేయడం లోకంలో ఉన్నదికదా.

32శ్లో॥ క్షిప్రమాయ మనాలోచ్య వ్యయమానః స్వవాంఛయా।
పరిక్షీయతఏవాసౌధనీ వైశ్రవణోపమః ॥

తా॥ "ఆయవ్యయాలు" అనేమాటలో ఆయం మొదటిది. వ్యయం రెండవది. అనగా ఆయమును అనుసరిస్తూనే వ్యయం ఉండవలెను అని ఈక్రమంలోని భావము.



ఇక ఆయమునుమించి వ్యయంచేసేవాడు దేవేంద్రుడంతటి, కుబేరుడంతటి వాడైననూసరే ఆర్థికముగా పూర్తిగా క్షీణించిపోవుదురు.

33 శ్లో॥ అరక్షితం తిష్ఠతి దైవరక్షితం, సురక్షితం దైవహతం వినశ్యతి ।
జీవత్యనాథోపి వనే విసర్జితః కృతః ప్రయత్నోపి గృహే న జీవతి ॥

తా॥ దేవునిచే రక్షింపబడిన వస్తువు మానవునిచే రక్షింపబడకున్ననూ అనగా దానిని వీధిలో పడవేసిననూ అది సురక్షితంగానే వుండును. ఇక దేవునిరక్షణలేని వస్తువు మనఇంట్లోపెట్టి రక్షిస్తూ ఉన్ననూ అది నశించిపోవును. అనగా ఒకనిని అనాథగా అరణ్యంలో విడిచిపెట్టిననూ అతడు క్షేమంగా జీవించియే ఉండును. ఇక ఇంట్లోఅందరి రక్షణలో వున్నవాడు మరణించును. అనగా దేవునిరక్షణ కల ప్రతివస్తువు ఎక్కడ విడిచిననూ అది సురక్షితముగానే వుండును.

34 శ్లో॥ ఖలః కరోతి దుర్వృత్తం ఫలం పతతి సాధుషు ।
దశాఽఽననోఽఽహరత్ సీతాం బంధనం స్యాన్మహోదధేః ॥

తా॥ దుర్మార్గుడు తనదుష్టవర్తనముచే చెడ్డపనిని చేయగా దానిఫలితము సజ్జనులమీదపడి వారు దుఃఖిం

చెదరు. ఎట్లనగా లోకకంటకుడైన రావణుడు సీతాదేవిని ఎత్తుకొనిపోయెను. ఆపాడుపనివలన రత్నగర్భ అనబడే సముద్రునకు బంధనం ప్రాప్తించినది.

35 శ్లో॥ న భూప్రదానం, న సువర్ణదానం, న గోప్రదానంచ
తథాఽన్నదానం ।
యథా వదంతీహ మహాప్రదానం సర్వేషు దానే
ష్వభయప్రదానం ॥

తా॥ భూదానము, సువర్ణదానము, గోదానము, అన్నదానము మొదలయిన అనేకదానములుగలవు. ఈ దానము లన్నింటికంటే అనాథునకుచేసిన "అభయప్రదాన మే" సర్వశ్రేష్ఠమైనది.

36 శ్లో॥ క్షమా ధనుః కరే యస్య దుర్జనః కిం కరిష్యతి ।
అతృణే పతితోవహ్నిః స్వయమే వోపశామ్యతి ॥

తా॥ సహనగుణము అనే ధనస్సు చేతిలో కలవానిని దుర్జనుడు ఏమీ చెయ్యలేడు. ఎట్లనగా లోకంలో గడ్డిలేని చోటపడిన నిప్పు తనకు తానే ఆరిపోవునుకదా.

37 శ్లో॥ అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలం।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥

తా॥ అర్జునా ! మనస్సుసహజంగానే చంచలమైనది. కనుక అది సులభంగాస్వాధీనము చేసుకొనుటకు శక్యం కానిది. కాని అది తీక్ష్ణమైన అభ్యాసముచేతను, గొప్పవైరాగ్యంచేతను స్వాధీనం కావచ్చును.



## శారీరకవాచికమానసికతపస్సులు :-

38 శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవం ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తపఉచ్యతే ॥

తా॥ దేవతలు, బ్రాహ్మణులు, గురువులు, విశేషజ్ఞులు వీరిని గౌరవించుట; బాహ్యాభ్యంతరములలో శుచిగా అనగా పవిత్రంగా ఉండుట; మనస్సులోను, మాటలోను ఒకేవిధమైన ప్రవర్తనము కలిగియుండుట, లేక మాటలలో సరళత్వమును చూపుట; బ్రహ్మచర్యము అనగా వేదాధ్యయనం చేస్తూ "మధుకరాన్నమును" తినుచూ నియమనిష్ఠలతో వేదగురుసేవనముచేస్తూ ఉండుట, అహింస అనగా ఇతరుల మనస్సును తనమాటలచేత కాని, పనులచేతకాని నొప్పించక ఉండుట అనే ఇవి శరీరసంబంధమైన తపస్సునకు చెందిన లక్షణములు, మధుకరము అనగా తుమ్మెద. తుమ్మెద కొన్ని పువ్వులమీదవాలి కొద్దికొద్దిగా తేనెనుతెచ్చి ఒకచోటపెట్టినట్లు విద్యార్థి కొన్ని ఇళ్లకువెళ్ళి కొద్దికొద్దిగా అన్నం, కూర మొదలయిన ఆహారద్రవ్యములను తెచ్చుకుని తన బస ఇంట్లో పెట్టుకొని భుజించుటను "మధుకరవృత్తి" అందురు.

39 శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ
యత్ ।
స్వాధ్యాయాభ్యాసనంచైవ వాఙ్మయం తప
ఉచ్యతే ॥

తా॥ మానవుడు మాట్లాడుమాట వినువారికి దుఃఖముకాని, క్షోభనుకాని కలిగించకుండా వుండవలెను. ఇంకనూ ఆమాట సత్యమయినదిగను, ప్రియమైనదిగను, హితమైనదిగను ఉండవలెను. ఇట్లే వేదాధ్యయనము యొక్కఅభ్యాసమును అనేఇవి వాచికమైన అనగా వాక్కుచే చేయుదగిన తపస్సు అని చెప్పబడుచున్నది.

40 శ్లో॥ మనఃప్రసాదస్సౌమ్యత్వంమౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపః మానసముచ్యతే ॥

తా॥ మనస్సును ప్రసన్నముగనుంచుట, శాంతస్వభావము కలిగి ఉండుట, మౌనము అనగా మననశీలుడై యుండుట, మనోనిగ్రహము. శుద్ధమైనభావము కలిగియుండుట అనే ఇవి మనస్సుచేత చేయతగిన తపస్సు అనబడును.

41 శ్లో॥ సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న
బ్రూయాత్ సత్యమప్రియం ।
ప్రియం చ నాఽనృతం బ్రూయాత్
ఏషధర్మ స్సనాతనః ॥

తా॥ సత్యమునే పలుకవలెను. ఆ సత్యమువినువానికి ప్రియముగా వుండవలెను. అప్రియమైన సత్యమునుగాని, ప్రియంగావున్న అసత్యమునుగాని పలుకరాదు. ఇది సనాతనమైన, అనగా ఎప్పుడూ మార్పు చెందని ధర్మము అని మనుస్మృతి చెప్పుచున్నది.



42 శ్లో॥ ఆదిత్యచంద్రా అనిలోఽనలశ్చ ద్యౌర్భూమి రాపో
హృదయం యమశ్చ ।
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే ధర్మశ్చ జానాతి
నరస్య వృత్తం ॥

తా॥ ఈశ్లోకమందు 14 గురు సాక్షులు చెప్పబడినారు. ఆసాక్షులు ఎవరనగా 1) సూర్యుడు, 2) చంద్రుడు, 3) వాయువు, 4) అగ్ని, 5) శబ్దము, 6) భూమి, 7) ఉదకం 8) తనహృదయము, 9) యమధర్మరాజు, 10 + 11) రాత్రి, పగలు, 12 + 13) రెండుసంధ్యాకాలములు, 14) ధర్మదేవత అనే ఈ 14 మంది సాక్షులు. మానవులందరి యొక్క మానసిక ప్రవృత్తులను అన్నిటినీ ప్రతీక్షణమందును పూర్తిగా పరిశీలించి, తమ డైలీపుస్తకములో రికార్డు చేయుచుందురు. కనుక సర్వమానవులయొక్క పుణ్యపాపములు పై 14 గురు సాక్షులకూ స్పష్టముగా కనిపిస్తూనే వుంటాయి. సత్యము ఇట్లుండగా కొందరుప్రబుద్ధులు "నేను రాత్రి ఒంటిగంటకు మాగదితలుపులు గట్టిగామూసి అతి రహస్యముగా ఈ పనిని చేసినాను కనుక నేనుచేసిన ఈపని దేవునికికూడా తెలియదు" అని ఆ ప్రబుద్ధులు సంతోషిస్తాంటారు. ఇట్టివారు నిజానికి మూర్ఖులేకదా ! చిరంజీవులారా ! మనం 39, 40 శ్లోకాలలో వాచిక, మానసిక తపస్సులను గూర్చి తెలుసుకున్నాము కదా ! ఇంకా మొట్టమొదటి శ్లోక తాత్పర్యంలో "మహాత్ములు" ఏపనిని చేసినా త్రికరణ

శుద్ధిగా చేస్తారని తెలుసుకున్నాము కదా ! ఈవిధంగా మీరు మీ పనులను త్రికరణశుద్ధిగా చేసుకుంటే మీపేరు సులభంగానే మహాత్ముల లిష్టులో చేరి మీరు పెద్దలకూ, చిన్నలకూ కూడా గౌరవింపదగినవారు అవుతారు. ఈవిధంగా ఈ "రత్నవిపణి" లోని ప్రతిఒకరత్నమూ మీకు యెంతటి అభ్యుదయములను కలిగిస్తుందో ప్రత్యక్షముగా చూస్తూన్నారు కదా !

43 శ్లో॥ హితం భుంజ్యాత్ మితం భుంజ్యాత్ ।
న భుంజ్యాత్ అహితం హితం ।
హిత మిష్టం చ భుంజీయాత్ ఏషధర్మ స్సనాతనః ॥

తా॥ మానవులు రోజూ తమకు హితమైనదానినే భుజించవలెను. హితమైన పదార్థమును మితంగానే భుజించవలెను. హితమైనది కదాఅని అమితంగా భుజించరాదు. ఇట్టిదే సనాతన ధర్మము అనబడును.

44శ్లో॥ కో హి భారః సమర్థానాం కిం దూరంవ్యవసాయినాం।
కో విదేశః సువిద్యానాం కః పరః ప్రియవాదినాం॥

తా॥ యెంతబరువైనను మోయగలవానికి బరువనేది వుండదు. శ్రద్ధగా భూమి వ్యవసాయం చేసుకునేవానికి దూరమనేది వుండదు. ఇట్లే మంచివిద్యగలవానికి విదేశమనేది వుండదు. ప్రియంగా మాటలాడువానికి పరుడు అనేమాట వుండదు.



45 శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః ।
సుకృతం దుష్కృతం చైవ చత్వారః సమభాగినః॥

తా॥ మంచిపనినిగాని, చెడ్డపనినిగాని చేసేవాడును, ఆపనిని చేయించేవాడును, ఆపనిని చేయుటకై ప్రేరేపించువాడును, ఆపనిని అంగీకరించువాడును ఈనలుగురును ఆపనివలనగలిగిన పుణ్యపాపములలో సమాన వాటాదారు లగుదురు.

46 శ్లో॥ కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః ।
వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః పికః పికః ॥

తా॥ కాకియు, కోయిలయును ఈరెండూ నల్లగానే వుండుటచేత రెండింటికీ తేడాలేదని తాత్కాలికముగా అనిపించును. కాని వసంతకాలం రాగానే కోయిల తన పంచమ రాగరంజితమైన తనమధుర కూజితములతో వినువారివీనులకు విందులుచేస్తూండగా, కాకి తనకూతనే కూయును. అప్పుడుమాత్రం రెండింటికిగల తేడా తెలిపోవును. ఈతాత్పర్యంవలన మనం గ్రహించతగిన విశేషం ఇది. మానవులందరూ సామాన్యంగా పైకి ఒకేవిధంగా కనిపిస్తారు. కనుక అందరూ సమానమైనవారే అని తాత్కాలికంగా అనిపించును. ఇకకొందరు వేదపండితులు వేదవిద్వత్ సభలో అద్భుతంగా ఘనస్వస్తి చెబుతున్నప్పుడు మాత్రం ఇటువంటి పండితులే అందరకూ ప్రత్యేకంగా గౌరవనీయులు అని తెలియగలదు. కనుక

అచిరభావిలో చిరంజీవులారా ! మీరు ఉత్తమభారతపౌరులుగా తయారు కావాలనుకుంటే ఎనిమిదిఏళ్ళ లేతవయస్సునుంచి మీరువేదశాస్త్ర, ప్రకృతిశాస్త్రములు (సైన్సు, కంప్యూటర్) వంటి విద్యలలో, మీకు ఇష్టమైన ఒకవిద్యలో డిగ్రీలు పొందవలసియున్నది.

47 శ్లో॥ ప్రాతః ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగతః
రాత్రౌ చోరప్రసంగేణ కాలో గచ్ఛతి ధీమతాం ॥

తా॥ ఈశ్లోకతాత్పర్యంలో శ్లోకకర్త ఒకచమత్కారమును చూపినాడు. లోకంలో ద్యూతప్రసంగం, స్త్రీ, చోరప్రసంగాలను చెడ్డవ్యసనములుగా భావిస్తారు. కాని ఈవ్యసనాలను ఈశ్లోకకర్త బుద్ధిమంతులవినోదాలుగా తెలిపినాడు. ఎట్లనగా ద్యూతప్రసంగము అనగా మహాభారతకథాప్రసంగము అని అర్థం చెప్పవలెను. మహాభారతంలో కౌరవపాండవులకు జూదమాడుటే ప్రధానకథగా చెప్పబడినది. కనుక ఇట్లే శ్రీమద్రామాయణకథలో సీతాదేవి పావనచరిత్రమే ప్రధానమై ఉన్నదికనుక స్త్రీప్రసంగము అనగా రామాయణకథా ప్రసంగమని భావము. ఇట్లే చోరప్రసంగమనగా వెన్నదొంగ అయిన శ్రీకృష్ణపరమాత్మ చరిత్రము ప్రధానముగా వర్ణించబడినది. కాన చోరప్రసంగం అనగా మహాభాగవతకథాప్రసంగము అని భావము.

48 శ్లో॥ హతో హనుమతారామః సీతా సా హర్షనిర్భరా ।
రుదంతి రాక్షసా స్సర్వే హాహారామో హతోహతః॥



తా॥ ఈశ్లోకంలో మొదట విపరీతార్థం వచ్చేవిధంగా ఒకసారి అర్థం వస్తుంది. అప్పుడు ఈ శ్లోకపదచ్ఛేదం ఇలావుంటుంది. హనుమతా + రామఃహతః - అనగా హనుమంతునిచేత శ్రీరాముడు చంపబడినాడు, ఈ వార్త విని సీతాదేవి హర్షపరవశ అయింది. రాక్షసులు శ్రీరాముడు చంపబడినాడని విలపిస్తున్నారు. ఈశ్లోకానికి మరోవిధంగా కూడా పదచ్ఛేదం చెయ్యవచ్చును. అలా చేసినప్పుడు పై విపరీతార్థం అంతాపోయి సత్యచరిత్రకు సరిపడిన రమణీయార్థం వచ్చేస్తుంది. ఎలాగంటే, హనుమతా + ఆరామఃహతః - అనగా హనుమంతునిచేత అశోకవనము నశింపజేయబడినది. ఈ మహావీరుడు నన్ను ఈ కష్టాల నుంచి గట్టెక్కించగలడని సీతామాత హర్షపరవశఅయింది. ఇకరాక్షసులు ఎంతోశ్రమపడి పెంచుకొన్న ఈఅశోకవనమును ఈకోతిగాడు ధ్వంసంచేసినాడని విలపించినారు. ఇటువంటి తమాషాగావున్న అర్థాలకు సంస్కృతభాష పుట్టినిల్లుగా వున్నది.

ఇకచెప్పబోయేవి యీదైవీగుణములు
భగవద్గీత 16 వ అధ్యాయం మొదటిది.

49 శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తపఆర్జవం॥

తా॥ 1) సన్మార్గాచరణమందు భయములేకుండుటయును, 2) శుద్ధసాత్వికవృత్తి 3) జ్ఞానమునందును,

యోగమునందును సుస్థితియును, 4) దానము, 5) దమము అనగా బాహ్యేంద్రియనిగ్రహము అనగా ఇంద్రియాలను వానివాని విషయాలనుండి మరలించి తనవశము నందుంచుకొనుట 6) యజ్ఞము అనగా అర్పణరూపమగు కర్మ, 7) స్వాధ్యాయము, వేదాధ్యయనము, 8) తపము శారీరక వాక్, మనస్సులచే చేయబడిన తపస్సు 9) ఆర్జవము అనగా సరళత్వము, ధర్మప్రవర్తనము.

50 శ్లో॥ అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతి రపైశునం
దయాభూతేషు అలోలత్వం మార్దవం హ్రీః
అచాపలం ॥

తా॥ 10) అహింస - ఇతరులను బాధింపకుండుట, 11) సత్యము-నిజముచెప్పుట, 12) అక్రోధము-కోపము లేకుండుట, 13) త్యాగము-సర్వసంగపరిత్యాగము, ఇట్లే కర్మఫలత్యాగము 14) శాంతి-చిత్తోపశమనము అనగాచిత్త నైర్మల్యము, 15) అపైశునం - క్షుద్రబుద్ధి లేకుండుట, ఉదారబుద్ధి కలిగియుండుట, 16) దయాభూతేషు-అనగా భూతదయ 17) అలోలత్వం-భౌతిక విషయములు సమీపించినపుడు ఇంద్రియవికారం లేకుండుట, 18) మార్దవం-క్రూరత్వము లేకుండుట, 19) హ్రీః - చేయకూడనిపనులను చేయుటయందు సిగ్గుపడుట 20) అచాపలం-వ్యర్థమగు పనులను చేయకుండుట.



51 శ్లో॥ తేజః క్షమా ధృతిః శౌచం అద్రోహః నాతిమానితా ।
భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత ॥

తా॥ 21) తేజస్సు-ప్రతిభ, పాగల్భ్యము, 22) క్షమ-ఓరిమి, సహనము, 23) ధృతి-ధైర్యము, పట్టుదల, 24) శౌచము - బాహ్యాభ్యంతరములలో శుచిత్వము, పరిశుద్ధత, 25) అద్రోహము-ఎవ్వరికిని కీడు చేయకుండుట 26) నాఽఅతిమానితా - దురభిమానము అనగా గర్వము లేకుండుట అనే 26 లక్షణములను ఓ అర్జునా! దేవతా సంబంధమయిన సంపదను దేవాంశమును అనుసరించి పుట్టినవానికి మీది 26 లక్షణములును కలుగుచున్నవి.

## భక్తియోగము (భగవద్గీత)

శ్రీ భగవానుడు పార్థునితో అనుచున్నాడు :

52 శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తాః
ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా
మతాః ॥

తా॥ నాయందు మనస్సును నిలిపి ఎల్లప్పుడునూ భగవంతునికి ఇష్టమయిన కర్మలను చేయుచున్నవారై గొప్పశ్రద్ధతో నన్ను ఉపాసించువారే శ్రేష్ఠులైన వారని నాభావము.

53 శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య
మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత
ఉపాసతే ॥
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార
సాగరాత్ ॥

తా॥ యెవరు తమసర్వకర్మలను నాకు సమర్పించి నాయందు దాసక్తికలవారై నన్నుధ్యానము చేయుచున్నారో అట్టివారిని సంసారసాగరమునుండి ఉద్ధరించుచున్నాను.

54 శ్లో॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాత్ ధ్యానం
విశిష్యతే ।
ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాత్ శాంతి
రనంతరం ॥

తా॥ అభ్యాసము కంటె జ్ఞానము శ్రేష్ఠమయినది. జ్ఞానముకంటే ధ్యానము శ్రేష్ఠమయినది. ధ్యానముకంటే కర్మఫలత్యాగము శ్రేష్ఠమయినది. ఆకర్మఫలత్యాగము వలన గొప్పశాంతి లభించును.

55 శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః స మే ప్రియతమో మతః ॥

తా॥ సమస్త భూతములయందును ద్వేష బుద్ధి లేని వాడును, మిత్రభావముకలవాడును, కరుణ అనగా దయ



కలవాడును, అహంకార రహితుడును, సుఖదుఃఖములయందు సమబుద్ధికలవాడును, యీలక్షణములుకలవాడును నాకు అనగా శ్రీకృష్ణపరమాత్మకు ప్రియతముడగును.

## విభూతియోగము.

(విభూతి అనగా ఐశ్వర్యం)

ముఖ్యమైనతనవిభూతులను భగవానుడు ఇందుచెప్పినాడు.

56 శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవి
రంశుమాన్ ।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥

తా॥ 12 గురు సూర్యులలో నేను విష్ణువు అను సూర్యుడను. ఇట్లే ప్రకాశింపజేయువానిలో కిరణములు గల సూర్యుడు నేను. 49 వాయుపులలో మరీచి అనువాయువు నేను. ఇట్లే నక్షత్రములలో చంద్రుడు నేను.

57 శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి
చేతనా ॥

తా॥ చతుర్వేదములలో సామవేదమును నేను. రుద్రాదిత్యాది వైదిక దేవతలలో ఇంద్రుడు నేను. ఇంద్రియములలో మనస్సు నేను. ప్రాణులలో చైతన్యము, జీవనము లేక బుద్ధి నేను.

58 శ్లో॥ రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం।
వసూనాం పావక శ్చాస్మి మేరుః శిఖరిణా మహం॥

తా॥ ఏకాదశరుద్రులలో శంకరుడు నేను. యక్షరాక్షసులలో కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను. అష్టపర్వతములలో మేరుపర్వతము నేను.

59 శ్లో॥ పురోధసాం చ ముఖ్యానాం విద్ధి పార్థ బృహస్పతిం
సేనానీనాం అహం స్కందః సరసా మస్మి సాగరః॥

తా॥ పురోహితులలో బృహస్పతిని నేను. సేనానాయకులలో స్కందుడు నేను. సరస్సులలో సముద్రము నేను.

60 శ్లో॥ మహర్షీణాం భృగు రహం గిరా మస్మి ఏకమక్షరం।
యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం
హిమాలయః॥

తా॥ మహర్షులలో భృగువునునేను, వాక్కులలో ఓంకారమునేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను. స్థావరములలో అనగా కదలకుండగావున్న వస్తువులలో హిమాలయ పర్వతం నేను.

61 శ్లో॥ అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలోమునిః॥

తా॥ వృక్షములన్నింటిలో రావిచెట్టు నేను. దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడు, సిద్ధులలో కపిలముని నేను.



62 శ్లో॥ ఉచ్చైశ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవం।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపః॥

తా॥ గుర్రములలో అమృతమథనసమయములో సముద్రమునుండి పుట్టిన "ఉచ్చైశ్రవసము" నేను. ఇట్లే "శ్రేష్ఠమయిన ఏనుగులలో నన్ను ఐరావతమను ఏనుగుగను, మనుష్యులలో రాజుగను" పార్థా! నన్ను తెలుసుకొనుము.

63 శ్లో॥ ఆయుధానాం మహం వజ్రం ధేనూనాం
అస్మి కామధుక్।
ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః॥

తా॥ ఆయుధములలో వజ్రాయుధము, ధేనువులలో కామధేనువు, సంతానకారకుడైన మన్మథుడు, సర్పములలో వాసుకి నేను.

64 శ్లో॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా
మహం।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ
పక్షిణాం॥

తా॥ రాక్షసులలో ప్రహ్లాదుడును, లెఖ్ఖపెట్టువారిలో కాలమును, జంతువులలో మృగరాజును, పక్షులలో గరుత్మంతుడును నేనే.

65 శ్లో॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహం।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ॥

తా॥ పరిశుద్ధము చేయువానిలో వాయువు నేను. శస్త్ర ధారులలో శ్రీరాముడు నేను. చేపలలో మొసలి నేను. నదులలో గంగానదిని నేను.

66 శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీఛందసా
మహం ।
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం
కుసుమాకరః॥

తా॥ సామవేద గానములలో "బృహత్సామము" అను గానము నేను. వేదమంత్రములలో గాయత్రి మంత్రము నేను. మాసములలో మార్గశీర్షమాసము, ఋతువులలో వసంతఋతువు నేను.

67 శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం
ధనంజయః ।
మునీనా మప్యహం వ్యాసః కవీనాం ఉశనాకవిః॥

తా॥ యాదవులలో వాసుదేవుడును, పాండవులలో అర్జునుడును, మునులలో వ్యాసుడును నేనే. కవులలో ఉశనుడు అను కవిని నేను.





శ్రీ ఆదిశంకర భగవత్పాదకృతమయిన

## "ప్రశ్నోత్తర రత్నమాలికా"

68 శ్లో॥ భగవన్ కి ముపాదేయం ? గురువచనం, హేయ
మపి చ కిం అకార్యం ।
కో గురుః ? అధిగతతత్త్వః ; శిష్యహితా
యోద్యత స్సతతం॥

తా॥ స్వామీ! ఏది గ్రహింపదగినది ? గురువు యొక్క ఉపదేశం. దేనిని వదలిపెట్టవలెను ? చెడ్డపనిని. గురువనగాఎవరు? సర్వదా శిష్యహితమునుకోరే తత్త్వజ్ఞాని.

69 శ్లో॥ త్వరితం కిం కర్తవ్యం ? సంసారసంతతిచ్ఛేదః ।
కిం మోక్షతరో ర్బీజం ? సమ్యక్ జ్ఞానం
క్రియాసిద్ధం॥

తా॥ విద్వాంసులు త్వరగా చేయవలసినది ఏది ? జననమరణ ప్రవాహమును త్రెంచుట, మోక్షము అనేచెట్టునకు బీజము ఏది ? స్వధర్మానుష్ఠానమువలన సిద్ధించిన తత్త్వజ్ఞానము.

70 శ్లో॥ కిం పథ్యతరః ? ధర్మః కః ? శుచిరిహ
యస్యమానసం శుద్ధం ।
కః పండితః ? వివేకీ, కిం విషం ? అవధీరణా
గురుషు॥

తా॥ మిక్కిలి హితకరమయినది ఏది ? ధర్మము. ఈప్రపంచములో పరిశుద్ధుడైనవాడు ఎవడు ? పరిశుద్ధ మయిన మనస్సుకలవాడు. పండితుడు అనగా ఎవరు ? యుక్తాయుక్త వివేకం కలవాడు. విషమునేది ఏది ? పెద్దల యందు తిరస్కారభావం.

71 శ్లో॥ కిం సంసారే సారం ? బహుశః వించిత్య మాన
మిదమేవ ।
కిం మనుజే ష్విష్టతమం ? స్వపరహితా యోద్యతం
జన్మ॥

తా॥ సంసారములో సారము ఏమిటి ? విశేషంగా ఆలోచించే తత్త్వజ్ఞానం. మనుష్యులయందు మిక్కిలి మంచిది ఏది ? తనయొక్కయు, పరులయొక్కయు హిత మును కోరెడి జన్మ.

72 శ్లో॥ కస్మా ద్భయ మిహ మరణాత్, అంధాదిహ కో
విశిష్యతే రాగే ।
క శ్శూరః ? యోలలనాలోచనబాణైః నచవ్యథితః॥

తా॥ ప్రపంచములో భయము దేనివలన కలుగును? చావువలన. గ్రుడ్డివానిని మించిన గ్రుడ్డి ఎవడు ? భౌతిక విషయాభిలాష కలవారు. ఎవడు శూరుడు ? స్త్రీల వాలు చూపులు అనే బాణముల దెబ్బకు లొంగనివాడు.



73 శ్లో॥ పాతుం కర్ణాంజలిభిః ? కి మమృత మిహ
యుజ్యతే ? సదుపదేశః ।
కిం గురుతాయాః మూలం ? యదేత దప్రార్థనం
నామ॥

తా॥ అమృతమువలె చెవులకు ఇంపుగా వినదగినది ఏది ? సజ్జనుల ఉపదేశములు. గొప్పతనమునకు కారణ మేది ? పరులను దేనికి యాచించకుండుట.

74 శ్లో॥ కిం గహనం ? స్త్రీచరితం, క శ్చతురః ?
యో నఖండితస్తేన ।
కిం దుఃఖం ? అసంతోషః, కిం లాఘవం ?
అధమతో యాచ్నా॥

తా॥ తెలుసుకొనుటకు అసాధ్యమయిన దేది ? స్త్రీ యొక్క చారిత్రము. నేర్పరి ఎవరు ? స్త్రీ చరిత్రముచేత ఖండితుడు కానివాడు. దుఃఖము అనగా ఏమిటి ? తృప్తి లేక పోవుట. తేలికతనం అంటే ఏమిటి ? నీచుని యాచించుట.

75 శ్లో॥ కిం జీవిత ? మనవద్యం కిం జాడ్యం ?
పాఠతోప్యనభ్యాసః ।
కో జాగర్తి? వివేకీ? కా నిద్రా ? మూఢతా జంతోః॥

తా॥ జీవనము అనగా ఏది ? అనింద్యమైనట్టి జీవ నము. జడత్వము అంటే ఏమిటి ? చదివినను తెలియక పోవుట. ఎవడు మెలకువ కలవాడు ? వివేకముకలవాడు. నిద్ర అనగా ఏది ? ప్రాణియొక్క మూర్ఖత్వము.

76 శ్లో॥ నళినీదళగతజలవత్ తరలం కిం ? యౌవనం,
ధనం చాయుః ।
కథయ పునః కే శశినః కిరణసమాః ? సజ్జనా ఏవ॥

తా॥ తామరాకుమీదఉన్న నీటిబిందువువలె చంచలమయినది ఏది ? యౌవనం, ధనం, ఆయుష్షు. వెన్నెలవలె చల్లనివా రెవరు ? సజ్జనులే.

77 శ్లో॥ కో నరకః ? పరవశతా, కిం సౌఖ్యం ?
సర్వసంగవిరతి ర్యా ।
కిం సాధ్యం ? భూతహితం, ప్రియం చ కిం ?
ప్రాణినాం అసవః॥

తా॥ నరకము ఏది ? పరుల అధీనములో ఉండుటయే. సుఖం అనగా ఏమిటి ? అన్ని సంగములనుండి విరమించుట. సాధింపవలసినదేది ? భూతదయ. ప్రాణులకు ఇష్టమయిన దేది ? తన ప్రాణములు.

78 శ్లో॥ కోఽనర్థఫలః ? మానః, కా సుఖదా ?
సాధుజనమైత్రి ।
సర్వం వ్యసనవినాశే, కో దక్షః ? సర్వధా త్యాగీ॥

తా॥ అనర్థములను తెచ్చిపెట్టున దేది ? దురభిమానము. సుఖమును ఇచ్చున దేది ? సత్పురుషులతో స్నేహము. సర్వవ్యసనములను త్రెంచుటకు ఎవరు సమర్థుడు ? అన్ని విధాల త్యాగంచేసేవాడు.



79 శ్లో॥ కిం మరణం ? మూర్ఖత్వం, కిం చాఽనర్ఘం ?
యదవసరే దత్తం ।
మరణాత్ కిం శల్యం ? ప్రచ్ఛన్నం యత్కృతం
పాపం॥

తా॥ మరణం అనేది ఏది ? అవివేకము లేక మూర్ఖత్వం. అమూల్యమైనది లేక వెలకట్టలేనిది ఏది ? అవసరమయిన సమయములో ఇయ్యబడిన ధనము మొదలయిన ద్రవ్యములు. చచ్చేవరకు బాధించునది ఏది ? చాటుగా చేయబడిన పాపము.

80 శ్లో॥ కాఽహర్నిశ మనుచిన్త్యా? సంసారాఽసారతా జగతి ।
కా ప్రేయసీ విధేయా ? కరుణా దీనేషు, సజ్జనే మైత్రి॥

తా॥ రాత్రింబవళ్ళు చింతించవలసినది అనగా ఆలోచించవలసినది ఏది ? సంసారమందలి అసారతయే. ఎవరిని ప్రేయసిగా అంగీకరించవలెను ? దుఃఖితులయందు దయ, సజ్జనులయందు స్నేహం.

81 శ్లో॥ కంఠగతైరప్యఽసుఖః ? కస్యహియాత్మా నశక్యతే
జేతుం ? మూర్ఖస్య శంకితస్య చ, విషాదినో వా,
కృతఘ్నస్య॥

తా॥ ప్రాణములు పోయిననూ ఎవరి మనస్సును జయించలేము ? మూర్ఖుడు. సంశయంతోకూడిన మనస్సుకలవాడు, దుఃఖముతోకూడిన మనస్సుకలవాడు, కృతఘ్నుడు. ఈపైనచెప్పినవారి మనస్సులను జయించలేము.

82 శ్లో॥ కః సాధుః ? సద్వృత్తం, క మథ మమాక్షతే ? అస
ద్వృత్తం, కేన జితం జగదేతత్ ? సత్యతితిక్షావతా
పుంసా॥.

తా॥ సజ్జనుడు ఎటివంటివాడు ? మంచినడవడిక కలవాడు. ఎవరిని నీచుడని చెప్పెదరు ? చెడు అలవాట్లు కలవారిని. ఈ ప్రపంచమును జయింపగలవారు ఎవరు ? సత్యము, ఓర్పుగల పురుషుడు.

83 శ్లో॥ కస్మై నమాంసి కుర్వంతి దేవాః ? దయాప్రధా
నాయా ।
కస్మాదుద్వేగః స్యాత్ ? సంసారారణ్యకః సుధియః॥

తా॥ దేవతలు ఎవరిని నమస్కరించెదరు ? దయయే ప్రధానంగా కలవానిని. దేనివలన ఏవగింపు కలుగవలెను ? విద్వాంసునకు సంసారము అనే అడవివలన.

84 శ్లో॥ కస్య వశే ప్రాణిగణః ? సత్యప్రియభాషిణః వినీతస్య।
క్వ స్థాతవ్యం ? న్యాయ్యే పథి దృష్టాఽదృష్ట
సుఫలాఢ్యే॥

తా॥ ప్రాణిసముదాయము (మానవులు) ఎవరి అధీనములో ఉందురు ? సత్యము, ప్రియమును పలికే వినయవంతుని అధీనములో నుందురు. ఎక్కడ వుండవలయును ? దృష్టాఽదృష్టఫలములతో కూడిన, న్యాయసమ్మతమయిన మార్గములో ఉండవలెను.



85 శ్లో॥ కో అంధః ? యో అకార్యరతః ? కో బధిరః ? యో
హితాని న శృణోతి ।
కో మూకః ? యః కాలే ప్రియాణి వక్తుం న జానాతి॥

తా॥ గుడ్డివా డెవడు ? చెడుపనిచేయువాడు. ఎవడు చెవిటివాడు ? హితకరమయిన మాటలు విననివాడు. మూగవాడు ఎవరు ? అవసరకాలములో ప్రియమైనమాటలను చెప్పలేనివాడు.

86 శ్లో॥ కిం దానం ? అనాకాంక్ష్యం, కిం మిత్రం ? యః
నివారయతి పాపాత్, కోఽలంకారః ? శీలం, కిం
వాచాం మండనం ? సత్యం॥

తా॥ ఏది దానము ? ప్రతిఫలము కోరనిది. స్నేహితుడు ఎవడు ? పాపమునుండి నివారించువాడు. అలంకారము ఏది ? మంచినడవడిక. వాక్కులకు అలంకారము ఏమిటి ? సత్యమును పలుకుట.

87 శ్లో॥ విద్యుద్విలసితచపలం కిం ? దుర్జనస్య సంసర్గః ।
కులశైలనిష్ప్రకంపాః కే ? కలికాలేపి సజ్జనా ఏవ॥

తా॥ మెరుపుతీగవలె చంచలమైనది ఏది ? దుష్టులతో సహవాసము. కలియుగంలోకూడా సప్త కులపర్వతములవలె తొట్రుపాటును చెందనివారు ఎవరు ? సజ్జనులే.

88 శ్లో॥ దానం, ప్రియవాక్ సహితం, జ్ఞాన మగర్వం,
క్షమాఽన్వితం శౌర్యం ।
విత్తం త్యాగసమేతం దుర్లభమేతత్ చతుర్భద్రం॥

తా॥ ప్రియవాక్కుతో కూడిన దానము, గర్వరహితమైన జ్ఞానము, సహనముతోకూడిన శౌర్యము, త్యాగముతోకూడిన ధనము - అనే ఈ నాలుగింటికి చతుర్భద్రము అని పేరు. ఇట్టి సన్నివేశము వెయ్యిమందిలో ఒకనికి లభ్యము కావచ్చును. కనుక ఇది దుర్లభమైనది.

89 శ్లో॥ కిం శోచ్యం ? కార్పణ్యం, సతివిభవే కిం ? ప్రశస్త
మౌదార్యం ?
కః పూజ్యో విద్వద్భిః స్వభావతః సర్వదా
వినీతః యః ॥

తా॥ శోచించతగినది ఏది? దైన్యములేకదీనత్వము. ఐశ్వర్యము ఉన్నపుడు ప్రశంసింపతగినది ఏది ? ఉదారభావము, విద్వాంసులచే పూజింపదగినవా డెవరు ? స్వభావముచేతనే ఎల్లప్పుడునూ వినయమును గలవాడు.

90 శ్లో॥ కస్మై స్పృహయతి కమలా ? అనలసచిత్తాయా
నీతివృత్తాయా ।
త్యజితి చ కం సహసా ద్విజగురుసురనిందకం
చ సాఽలస్యం॥

తా॥ సంపద ఎవరిని వరించును ? సోమరితనంలేని నీతిపరుని వరించును. సంపద త్వరగా ఎవరిని వదలిపెట్టును ? బ్రాహ్మణులను, గురువులను, దేవతలను నిందించువానిని, మరియు సోమరితనముకలవానిని విడచిపెట్టును.



91 శ్లో॥ కేనాఽశోచ్యః పురుషః ప్రణతకళత్రేణ
ధీరవిభవేన ।
ఇహ భువనే కః శోచ్యః ? సత్యపి విభవేన యో దాతా॥

తా॥ దేనిచే పురుషుడు అశోచ్యుడు అగును ? వినీతురాలైన భార్యచేతను, ధైర్యముచేతను, లోకంలో శోచింపదగినవాడెవడు ? సంపదవున్నను దానము చేయనివాడు.

92 శ్లో॥ కః పంగుః ఇహ ప్రథితః ? వ్రజతి చ యః నవార్ధకే
తీర్థం ।
కిం తీర్థమపి చ ముఖ్యం ? చిత్తమలం యః
నివర్తయతి ॥

తా॥ ఈ ప్రపంచములో కుంటివాడెవరు ? వృద్ధాప్యంలో తీర్థయాత్రలు చేయనివాడు. ముఖ్యమయిన తీర్థము ఏది ? ఏది మనోమాలిన్యమును పోగొట్టునో ?

93 శ్లో॥ కిం సంపాద్యం మనుజైః ? విద్యావిత్తం బలం
యశః పుణ్యం ।
కః సర్వగుణవినాశీ ? లోభః శత్రుశ్చ కః ?
కామః ॥

తా॥ మనుష్యుడు దేనిని సంపాదింపవలెను ? విద్య, ధనము, కీర్తి, బలము, పుణ్యము అనే వానిని సమస్తగుణములను నశింపజేయునది ఏది ? లోభము. శత్రువెవరు ? కామరూపమైన కోరిక.

94 శ్లో॥ ప్రాణాదపి కః రమ్యః ? కులధర్మః, సాధు సంగశ్చ ।
కా సంరక్ష్యా ? కీర్తిః పతివ్రతా నైజబుద్ధిశ్చ ॥

తా॥ ప్రాణముల కంటే రమ్యమయిన దేది ? కుల ధర్మము, సజ్జనసహవాసము. దేనిని కాపాడు కొనవలెను ? కీర్తిని, పతివ్రతను, సచ్ఛీలమును.

95 శ్లో॥ కా కల్పలతా లోకే ? సత్ శిష్యాయార్పితా విద్యా।
కః అక్షయవటవృక్షస్స్యాత్ ? విధివత్ సత్పాత్రదత్తదానం యత్ ॥

తా॥ లోకములో కల్పలతవంటిది ఏది ? మంచి శిష్యునకు నేర్పినవిద్య. అక్షయవటవృక్షము వంటిది ఏది ? విధిపూర్వకముగ అర్హతగల మంచి యాచకునకు చేసిన దానము.

96 శ్లో॥ కస్మాత్సిద్ధిః ? తపసః, బుద్ధిః క్వను భూసురే, కుతో బుద్ధిః ।
వృద్ధోపసేవయా కే వృద్ధాః ? యే చ ధర్మ తత్త్వజ్ఞాః ॥

తా॥ దేనివలన సిద్ధికలుగును ? తపస్సువలన. జ్ఞానము ఎక్కడవుండును ? బ్రాహ్మణునియందు. జ్ఞానము ఎట్లు కలుగును ? పెద్దల సేవచేత. పెద్దలనగా ఎవరు ? ధర్మ తత్త్వమును తెలిసినవారు.



97 శ్లో॥ సర్వసుఖానాం బీజం కిం ? పుణ్యం, దుఃఖమపి కుతః ।
పాపాత్, కస్యైశ్వర్యం ? యః కిల శంకరమారాధయేత్ భక్త్యా ॥

తా॥ సమస్తసుఖములకు కారణం ఏది ? పుణ్యము. దుఃఖము దేనివలన కలుగును ? పాపమువలన. ఎవనికి ఐశ్వర్యము కలుగును ? భక్తితో ఈశ్వరుని ఆరాధించు వానికే కలుగును.

98 శ్లో॥ కోవర్ధతే వినీతః ? కోవాహీయేత యోదృప్తః ।
కోనః ప్రత్యేతవ్యః ? బ్రూతే యః అనృతంశశ్వత్॥

తా॥ ఎవడు వృద్ధిపొందును ? వినయముకలవాడు. ఎవడు క్షీణించును ? గర్వితుడు. ఎవనిని నమ్మరాదు ? తరచుగా అబద్ధమాడువానిని.

99 శ్లో॥ కుత్రాఽనృతేప్యపాపం ? యచ్చోక్తం ధర్మరక్షార్థం ।
కో ధర్మః ? అభిమతో యః శిష్టానాం నిజకులీనానాం ॥

తా॥ ఎటువంటి అబద్ధము పాపమునుకలుగజేయదు? ధర్మరక్షణకొరకు మాత్రమే పలుకబడినది. ఏదిధర్మము ? తమకులీనులైన శిష్టులకు అభిమతమైనది.

100 శ్లో॥ కస్యక్రియాహి సఫలాః ః యః పునరాచారవాన్
శిష్టః ।
కః శిష్టః ? యః వేదప్రమాణవాన్ కో హతః ?
యః క్రియాభ్రష్టః ॥

తా॥ ఎవనిపనులు సఫలములగును ? ఆచారవంతుడైన శిష్టునివి. శిష్టుడు ఎవరు ? వేదమును ప్రమాణమని అంగీకరించువాడు. పనికిమాలనవాడు ఎవరు ? సత్కర్మ లేనివాడు.

101 శ్లో॥ కో ధన్యః ? సన్న్యాసీ, కః మాన్యః ? పండితః
సాధుః ।
కః సేవ్యః ? యః దాతాః, కః దాతా ? యః అర్థి
తృప్తి మాతనుతే ॥

తా॥ ధన్యుడు ఎవరు ? సన్యాసి. ఎవరు గౌరవనీయుడు ? సాధువైనపండితుడు. సేవించదగినవాడెవడు దానముచేయువాడు. దాత ఎవడు ? యాచకుడిని తృప్తి పొందించువాడు.

102 శ్లో॥ కిం దుష్కరం నరాణాం ? యత్ మనసః
నిగ్రహః సతతం ।
కః బ్రహ్మచర్యవాన్స్యాత్ యః అస్ఖలితః ?
ఊర్ధ్వరేతరస్కః ॥



తా॥ మనుష్యునకు కష్టసాధ్యమేది ? ఎల్లప్పుడు మనస్సును నిగ్రహించుట, బ్రహ్మచర్యము కలవాడు ఎవడు ? స్ఖలనములేని ఊర్ధ్వరేతస్కుడు.

103 శ్లో॥ కా పరదేవతోక్తా ? చిచ్ఛక్తిః, కః జగద్భర్తా ?
సూర్యః ।
సర్వేషాం కః జీవనహేతుః ? స పర్జన్యః॥

తా॥ ఉత్కృష్టమయిన దేవత ఏది ? చిచ్ఛక్తియే. జగత్తునకు భర్త అనగా పోషించువాడు ఎవరు ? సూర్యపరమాత్మ. అందరికీ జీవనసాధన మెవరు ? మేఘుడు.

104 శ్లో॥ కః శూరః ? యః భీతత్రాతా, త్రాతా చ కః ?
స సద్గురుః ।
కో హి జగద్గురు రుక్తః ? శంభుః ? జ్ఞానం కుతః ?
శివా దేవ॥

తా॥ శూరుడు ఎవడు ? భయపడినవానిని రక్షించువాడు. ఎవరు రక్షించువాడు ? శ్రేష్ఠమయిన ఉపదేశకుడు. జగద్గురువు ఎవడు ? శంకరుడు. జ్ఞానం ఎవరివలన కలుగును ? శివునివలననే.

105 శ్లో॥ కో మాయీ ? పరమేశః, క ఇంద్రజాలాయతే ?
ప్రపంచోఽయం ।
కః స్వప్ననిభః ? జాగ్రద్వ్యవహారః, సత్యమపి
చ కిం ? బ్రహ్మ॥

తా॥ ఎవడు మాయగలవాడు? పరమేశ్వరుడు. ఏది ఇంద్రజాలమువలె కనిపించుచున్నది? ఈ ప్రపంచము. స్వప్నమువంటిది ఏది? జాగ్రత్కాలమందు చేసిన మనపనులు. సత్యమయినది ఏది? బ్రహ్మమే.

106శ్లో॥ కః బ్రాహ్మణై రుపాస్యః? గాయత్రీ
అర్కాఽగ్నిగోచరః శంభుః।
గాయత్ర్యాం ఆదిత్యే అగ్నౌ శంభౌ చ కిం
ముతత్త్వం?॥

తా॥ బ్రాహ్మణులచేత ఉపాసింపదగినది ఏది? గాయత్రి, సూర్యుడు, అగ్ని. వీరియందు గోచరించు శివుడే. వీరియందున్నది ఏది? అపరతత్త్వము.

107శ్లో॥ ప్రత్యక్షదేవతా కా? మాతా, పూజ్యః గురుశ్చ
కః, తాతః।
కః సర్వదేవతాత్మా? విద్యాకర్మాన్వితః విప్రః॥

తా॥ ప్రత్యక్షమయిన దేవత ఏది? తల్లియే. పూజ్యుడు, గురువును అయినవాడు ఎవరు? తండ్రియే. సర్వదేవతాస్వరూపుడు ఎవరు? జ్ఞానము, కర్మ కల విప్రుడు.



108శ్లో॥ క శ్చ కులక్షయహేతుః? సంతాపః, సజ్జనేషు
యోఽకారి।
కేషాం అమోఘవచనం? యే చ పునః
సత్యమౌనశమశీలాః॥

తా॥ కులనాశనమునకు కారణమేమిటి? సత్పురుషులకు కలిగించిన సంతాపము. ఎవరిమాట వ్యర్థముకాదు? సత్యము, మౌనము, శాంతియు గలవారిమాట వ్యర్థము గాదు.

109శ్లో॥ కిం జన్మ? విషయసంగః, కిం ఉత్తరం జన్మ?
పుత్రః స్యాత్।
కః అపరిహార్యః? మృత్యుః, కుత్ర పదం
న్యసేచ్చ? దృక్పూతే॥

తా॥ జన్మ అనగా ఏమి? భౌతికవిషయములందు ఆసక్తి, ఉత్తరజన్మ అనగా ఏమిటి? పుత్రుడు. పరిహరించుటకు వీలులేనిది ఏది? మృత్యువు. ఎక్కడ అడుగు వేయవలెను? బాగుగా చూచినచోట.

ఈ విషయమునే ఇంకొక కవి ఇట్లు చెప్పెను-

110శ్లో॥ దృష్టిపూతం న్యసే త్పాదం, వస్త్రపూతం జలం
పిబేత్।

సత్యపూతాం వదే ద్వాచం మనఃపూతం
సమాచరేత్॥

తా॥ మానవుడు తన దృష్టిచేత పవిత్రింపజేసిన ప్రదేశములోనే తన అడుగువేయవలెను. త్రాగేనీటిని వడ పోసి మరీ త్రాగవలెను. వివేకం కలవాడు తను మాట్లాడే ప్రతిమాటనూ సత్యముగా ఉండేటట్లు ఆలోచించిన పిమ్మటనే మాట్లాడవలెను. తనుచేసే ప్రతిపనినీ మనస్సుతో బాగాఆలోచించి, అనగా ఈపని చేయవచ్చునని తననిర్మల చిత్తము సూచించినపిమ్మటనే ఆపనిని చేయవలెను. ఈ విషయమునే మనపెద్దలు "అప్పుడసేమాట ఆరునెలలు ఆలోచించి మాట్లాడవలెను" అని మన శ్రేయస్సును కోరి ఆపెద్దలు చెప్పినారు. కనుకనే పెద్దలమాట పెరుగన్నము మూట అని సూక్తి.

111శ్లో॥ పాత్రం కి మన్నదానే? క్షుధితః, కః ఆర్చ్యో హి ?
భగవదవతారః ।

క శ్చ భగవాన్ ? మహేశః, శంకరనారాయణా
త్మైకః॥

తా॥ అన్నదానానికి పాత్రము తగినది ఏది ? ఆకలి గొన్నవాడు. ఎవడు పూజింపదగినవాడు ? భగవంతుని



అవతారము కలవాడు. భగవంతుడు ఎవరు ? శంకరుడు, నారాయణుడు అను పేరులతోనున్న పరమాత్మ ఒక్కడే.

112శ్లో॥ ఫల మపి భగవద్భక్తేః కిం ? తల్లోకస్వరూప
సాక్షాత్వం ।

మోక్ష శ్చ కః ? అవిద్యాస్తమయః, కః
సర్వవేదభూః ? "అథ ఓమ్"॥

తా॥ భగవంతునియందు భక్తికిఫలము ఏది? అతని లోకమును, స్వరూపమును సాక్షాత్కరించుట. మోక్షమనగా ఏమి ? అవిద్యానాశము. సర్వవేదములకు ఆధారభూతమయినది ఏది ? "ఓమ్‌కారము".

113శ్లో॥ ఇత్యేషా కంఠస్థా ప్రశ్నోత్తర రత్నమాలికా
ఏషాం ।

తే ముక్తాభరణాః ఇవ విమలాః ఆభాంతి
సత్సమాజేషు॥

తా॥ ఎవరయితే ఈ "ప్రశ్నోత్తరమాలికను" కంఠస్థము చేయుదురో వారు సత్పురుషుల గోష్ఠులయందు ముత్యములతో కూడిన ఆభరణములు కలవారివలె స్వచ్ఛ ప్రకాశముతో "ప్రకాశించెదరు."

114శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం, న్యాయ్యేన
మార్గేణ మహీం మహేశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం, లోకా
స్సమస్తాః సుఖినః భవంతు॥

(శాంతిపాఠము).

115శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

116శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽత్మనా వా ప్రకృతేః ।
స్వభావత్ కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

“సర్వేభ్యః స్వస్తి భూయాత్”.

